ప్రత్యేక సంచిక

# కార్మిక లోకం

మాసపత్రిక

సంచిక : 11 సంపుటి : 30 నవంబర్ - 2017 రూ.10/-

## ప్రపంచ గతినే మార్చిన

# అక్టోబర్ మహా విప్లవానికి జేజేలు



Prohibition and Exicise Department
Govt. of Andhra Pradesh

A.P. State Beverages Corporation Ltd
Vijayawada

**Drinking Alcohol is Harmful**

**ALCOHOLISM**

**INFLUENCE OF ALCOHOL ON ORGANISM**




**మద్యపానం హానికరం**



**Usage of Narcotic drugs and psychotropic substances is injurious to health**



**నార్కోటిక్ మందులు మరియు సైకోట్రోపిక్ పదార్థాల వినియోగం ఆరోగ్యానికి హానికరం**

## Object of the Department :

**Eradication of :- Illicit Distillation, Usage of Narcotic drugs, Usage of Psychotropic substances and Cannabis(Ganja) Cultivation.**

## Scope of the Department :

**Control of :- Illicit liquor, Non Duty paid Liquor, Sale at Unauthorized Places, Narcotic drugs, Awareness on the ill effects of Alcohol.**

**Commissioner**
**Proh. & Excise Department**
**Government of Andhra Pradesh**

**Managing Director**
**APSBCL, Vijayawada**

నవంబర్- 2017

# కార్మిక లోకం

సి.ఐ.టి.యు. ఆంధ్రప్రదేశ్ కమిటీ మాసపత్రిక

సంపుటి : 30
సంచిక : 11
విడి ప్రతి వెల : రూ. 10/-
సం॥ చందా : రూ. 75/-


## విషయసూచిక




అడ్రస్ :
నండూరి ప్రసాదరావు భవన్,
24-24-14, రజకవీధి,
దుర్గాపురం, విజయవాడ-3
సెల్ : 9490098022 - 0866-2442988




## సంపాదకీయం

# తరగని అక్టోబరు విప్లవ స్ఫూర్తి

కమ్యూనిస్టు భూతం యూరప్‌ను ఆవహించిందని 1848లో తాము రాసిన కమ్యూనిస్టు ప్రణాళికలో మార్క్సు, ఎంగెల్స్ చెప్పారు. యూరప్‌లో భాగంగా ఉన్న రష్యన్ ప్రజానీకం జార్ చక్రవర్తి పాలనలో మగ్గిపోయింది. కోట్లాది ఎకరాల భూమికి యజమానైన జార్ చక్రవర్తి, కొద్ది మందిగా ఉన్న భూస్వాములు రైతులను, పెట్టుబడిదారులు కార్మికులను విపరీతమయిన దోపిడీకి గురిచేశారు. పాలకులు తమ ప్రయోజనాల కోసం మొదటి ప్రపంచ యుద్ధంలో చేరి రైతులు, కార్మికులను మందుగుండు సామాగ్రిగా వాడుకున్నారు. యుద్ధ చర్యలతో తీవ్రమయిన అసంతృప్తి చెలరేగి, లెనిన్ పిలుపుతో కార్మికవర్గం బోల్షివిక్ పార్టీ నాయకత్వాన తిరుగుబాటు జెండా ఎగురవేసింది. 1917 ఫిబ్రవరిలో కొద్దికాలం పాటు బూర్జువాలు అధికారంలో ఉన్నా, అది ఎంతో కాలం నిలవక కూలిపోయింది. సోవియట్ల (పాలక కౌన్సిళ్ల)న్నీ బోల్షివిక్కుల స్వాధీనం కాగానే అధికారమంతా సోవియట్లకే అన్న లెనిన్ పిలుపును అందుకుని 1917 నవంబరు 7న (రష్యన్ పాత క్యాలండర్ ప్రకారం అక్టోబరు 25) కార్మికవర్గం సాయుధ బలంతో అధికారాన్ని చేజిక్కించుకుంది.

జార్ చక్రవర్తి పాలనలో అణచివేతకు గురయిన రిపబ్లిక్కులను కూడా కలుపుకుని యునైటెడ్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్స్ (యుఎస్ఎస్ఆర్)గా ఏర్పడిన సోషలిస్టు రష్యా అంతర్యుద్ధాన్ని కూడా ఎదుర్కొని, 1935 వచ్చేప్పటికల్లా నిరక్షరాస్యతను, నిరుద్యోగాన్ని రూపు మాపింది. భూములను స్వాధీనం చేసుకుని ఉమ్మడి వ్యవసాయ క్షేత్రాలుగా ఏర్పాటు చేయటంతోపాటు పరిశ్రమలను జాతీయం చేసింది. కొద్దికాలంలోనే సోవియట్ రష్యా తలసరి జాతీయ ఆర్థికాభివృద్ధి 440 శాతం పెరిగి జపాన్‌నే మించి పోయింది. మహిళలకు సమాన హక్కులు కల్పించి వాటిని ఆచరణలో పెట్టడానికి సామూహిక వంటశాలలు, వృద్ధాశ్రమాలు, పిల్లల పాలనా కేంద్రాలను ఏర్పాటు చేసింది. మానవుడు మానవుడిని దోపిడీ చేసే సమాజానికి మొదటిసారిగా కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ సోవియట్ యూనియన్ (బోల్షివిక్ పార్టీ పేరు ఈ విధంగా మారింది) నాయకత్వంలో సోవియట్ రష్యాలో గోరీ కట్టబడింది.

వలస పాలన నుండి విముక్తి కావటానికి జరిగే స్వాతంత్ర్యపోరాటాలు అక్టోబరు విప్లవ స్ఫూర్తితో తీవ్రమయ్యాయి. 1918 తర్వాత భారత దేశంలో కార్మిక సంఘాల ఏర్పాటు, సమ్మెలు కొన్ని వందల రెట్లు పెరిగాయి. జవహర్‌లాల్ నెహ్రూ, రవీంద్రనాథ్ టాగూర్‌లు రష్యా అభివృద్ధిని చూసి ఆశ్చర్యపోయారు. రెండో ప్రపంచ యుద్ధంలో సోవియట్ రష్యా తన భూభాగంలో హిట్లర్‌ను మట్టిగరిపించి, జర్మనీ దాకా వెనక్కి గొట్టింది. తూర్పు యూరప్ రాజ్యాలు సోషలిస్టు దేశాలుగా మారాయి. ఆ తర్వాత చైనా, కొరియా, వియత్నాం, క్యూబా దేశాల్లో కార్మికవర్గం విప్లవం ద్వారా అధికారంలోకి వచ్చింది.

వలస పాలన నుండి విముక్తి పొందిన మూడో ప్రపంచ దేశాలు ఆర్థికంగా అభివృద్ధి కావటానికి సోవియట్ సోషలిస్టు రష్యా ఇతోధిక సహాయం చేసింది. ప్రత్యేకించి భారతదేశంలో ప్రభుత్వరంగ అభివృద్ధికి తోడ్పాటు ఇచ్చింది. మూడో ప్రపంచ దేశాలను అణచివేయటానికి, దురాక్రమణ చేయటానికి అమెరికా ప్రయత్నించినప్పుడల్లా సోవియట్ రష్యా అడ్డుపడింది. తాను కూడా మిలిటరీ పరంగానూ, అణ్వాయుధాల సముపార్జనలోనూ ముందు పీఠిన ఉండి ప్రపంచ సామ్రాజ్యవాదాన్ని నిలువరించింది. ప్రపంచంలో మూడో వంతు ప్రజలు సోషలిస్టు దేశాల కిందకి వచ్చిన తర్వాత వలస పాలనకు స్థానం లేకుండా పోయింది.

బాహ్య, అంతర్గత కారణాలతో సోవియట్ రష్యాలో సోషలిజం కుప్పకూలినా, దాన్ని పరిణామక్రమంలో ఎదురైన ఒడిదుడుకులుగా చూడాలి. సామ్రాజ్యవాదం ఉన్నంతకాలం సోషలిజానికి ఎల్లప్పుడూ ప్రమాదం పొంచి ఉంటుంది. సోషలిజం ఉంటే సామ్రాజ్యవాద దోపిడీకి అడ్డుకట్ట పడుతుంది. ప్రపంచ కార్మికవర్గం సామ్రాజ్యవాదాన్ని ఓడించాలి. దోపిడీలేని సమ సమాజాలను ఏర్పరుచుకోవాలి. విదేశీ బహుళజాతి కంపెనీలు, విదేశీ ఫైనాన్స్ పెట్టుబడులకు, స్వదేశీ గుత్త పెట్టుబడులకు అనుకూలమయిన విధానాలకు వ్యతిరేకంగా భారతదేశ కార్మికవర్గం తీవ్రమయిన పోరాటం చేస్తున్నది. ఈ పోరాటంలో అక్టోబరు మహత్తర విప్లవం స్ఫూర్తినిస్తుంది.

# గర్జించు రష్యా

గర్జించు రష్యా
గాండ్రించు రష్యా
పర్జన్య శంఖం
పలికించు రష్యా!
దౌర్జన్య రాజ్యం
ధ్వంసించు రష్యా!
లేలే, రష్యా!
రారా, రష్యా!
రష్యా! రష్యా! రష్యా!
ఓ రష్యా!

వ్యక్తి స్వతస్సిద్ధ
స్వాతంత్రదాతా!
పతిత నిర్గతిక
ప్రపంచత్రాతా!
భావికల స్వర్ణభవన
నిర్మాతా!
లేలేలే రష్యా!
రారారా రష్యా!
రష్యా! రష్యా! రష్యా!
రష్యా!
పుష్కిన్, గోగోల్,
షెకోవ్,
టాల్‌స్టాయ్,
డాస్టోయ్‌వస్కీ, గోర్కీ,
కూప్రిన్
శిల్ప సమ్రాట్టులై
జీవితం మథియించి,
పాప పంకం నుండి
పద్మాలు పుట్టించి,
కార్మిక స్వర్గాన్ని
కలగన్న
రష్యా!
రష్యా! రష్యా! రష్యా!
ఓ రష్యా!
మార్క్స్, ఎంగెల్స్, మహా
ప్రవక్తలై
మానవ పురోగమన
మార్గాలు తెరవగా

లెనిన్ తపస్సు
స్టాలిన్ సేద్యం
జ్వలించిన, ఫలించిన
స్వముజ్జ్వల తేజం!
యునైటెడ్ సోవియట్
సోషలిస్ట్ రాజ్యం
స్వాతంత్ర శత్రువుల
గుండెల్లో బల్లెం!
పరపీడనాపరుల
ప్రాణాల అభైరవి



రారారా, రష్యా!
రష్యా! రష్యా! రష్యా!
ఓ రష్యా!
ఈ అగ్ని వర్షాలు
ఈ రక్తపాతాలు
ఎలాగూ వచ్చాయి,
ఏమయితే కానీ
ఈ పవన రంగంలో
ఎగరనీ జీవాలు!
ఈ సమయం తుది చూడక
ఇక నిలిచిపోరాదు!
తిరుగులేని ప్రతిజ్ఞ తీసుకో
రష్యా!
పెట్టుబడి కూటాలు
కట్టకడుతున్నాయి
కుట్రలు, కూహకం
చెలరేగుతున్నాయి

అసత్య ప్రచారపు రేడియోబాకా!
రాజకీయాల్లో రంగుల వేషాలు,
మర ఫిరంగులు తెచ్చి
మందిచ్చి రష్యా!
విమాన బాహువులు
విసురుతూ, రష్యా!
అనంత ప్రపంచం
అంతటా నీవై
నీ గొడుగు నీడల్ని
సాగించు రష్యా!
అనంత ప్రపంచం
అంతటా నీవై
నీ గొడుగు నీడల్ని
సాగించు రష్యా!
స్వతంత్రత, సమానత,
సాధించు రష్యా!
రష్యా! రష్యా! రష్యా!
ఓ రష్యా!
సుప్త కంకాళాలు
మేలుకొంటున్నాయి!
ప్రపంచం పడగెత్తి
బుసకొట్టి లేచింది!
కార్మికులు, కర్షకులు,
తాడితులు, పీడితులు
కెరటాలుగా పొంగి
తిరగబడుతున్నారు!
ప్రపంచం నీ కోసం
పరిపక్వంగా ఉంది!
కోటి గొంతులు నిన్ను
కౌగిలిస్తున్నాయి!
సై అంటూ రష్యా!
జై అంటూ రష్యా!
లేలేలే రష్యా!
రారారా రష్యా!
రష్యా! రష్యా! రష్యా!
ఓ రష్యా!

– మహాకవి శ్రీశ్రీ

# వినిమయ ధరల సూచిక (బేస్ 2001=100) 2017

| సెంటర్ సిరీస్ | జూన్ | జూలై | ఆగస్టు | సెప్టెంబర్ |
|---|---|---|---|---|
| ఆల్ ఇండియా | 280 | 285 | 285 | 285 |
| గుంటూరు | 274 | 276 | 279 | 277 |
| విశాఖపట్నం | 276 | 280 | 285 | 282 |
| విజయవాడ | 277 | 280 | 278 | 277 |
| హైదరాబాద్ | 246 | 250 | 249 | 249 |
| **రాష్ట్ర సిరీస్** | **ఏప్రిల్** | **మే** | **జూన్** | **జూలై** |
| విజయనగరం | 284 | 283 | 285 | 289 |
| రాజమండ్రి | 292 | 290 | 293 | 295 |
| జగ్గయ్యపేట | 302 | 303 | 306 | 309 |
| తిరుపతి | 273 | 274 | 276 | 278 |
| ఏ.పి | 279 | 279 | 281 | 284 |

| లింకింగ్ ఫ్యాక్టర్ | 1971=100 | 1960=100 | 1982=100 |
|---|---|---|---|
| ఆల్ ఇండియా | – | 4.93 | 4.63 |
| హైదరాబాద్ | – | 5.23 | 4.79 |
| గుంటూరు | – | 5.60 | 4.57 |
| విశాఖపట్నం | 2.48 | 1.87 | 4.64 |
| విజయవాడ | – | – | 4.28 |
| విజయనగరం | – | – | 3.93 |
| కాకినాడ | 2.55 | 1.81 | 4.26 |
| జగ్గయ్యపేట | – | – | 4.28 |
| తిరుపతి | – | – | 4.57 |

## పాఠకులకు విజ్ఞప్తి

**'కార్మికలోకం'**పై మీ స్పందనను ఆహ్వానిస్తున్నాం. పత్రికలోని వ్యాసాలు, వార్తలు, వ్యాఖ్యలపై మీ అభిప్రాయాలు నిర్మొహమాటంగా రాసి పత్రిక అభివృద్ధికి సహకరించాలని విజ్ఞప్తి చేస్తున్నాం. లేఖలతో పాటు తాజా పాస్‌పోర్ట్ సైజ్ ఫొటో కూడా పంపగలరు.

అడ్రస్ : నండూరి ప్రసాదరావు భవన్, 24-24-14, రజకవీధి, దుర్గాపురం, విజయవాడ-520003.
ఫోన్ : 9494899322, 9490098022, e-mail : karmikalokam@gmail.com,

సర్క్యులేషన్ వివరాలకు సంప్రదించాల్సిన ఫోన్ నెంబర్లు
**9490098022, 9494899322**
కొత్త చందాలు కట్టేవారు, పాతవి పునరుద్ధరించుకొనే వారు డబ్బును యూనియన్ బ్యాంక్ విజయవాడ పేరుతో పంపించగలరు.
**Karmika Lokam A/c No. : 448802010000833**
**(IFSC : UBIN0534641), Governorpet Branch, Vijayawada.**

## రచయితలకు సూచన

కార్మికలోకం పత్రికకు రచనలను ఆహ్వానిస్తున్నాం. కార్మికుల జీవితానికి సంబంధించిన కథలు, కవితలు, వాస్తవ జీవిత చిత్రణలు పంపించవచ్చు. కార్మికులను కదిలించే వాటికి ప్రాధాన్యత. రచనలను 20వ తేదీలోపు కార్మికలోకం మెయిల్ లేదా పోస్టల్ అడ్రెస్‌కు పంపించ మనవి.

- ఎడిటర్

## ఎవ్వడురా అన్నది...

ఎవ్వడురా అన్నది... ఎవ్వడురా అన్నది...
కమ్యూనిజం చచ్చిపోయిందని ఎవ్వడురా కూసింది...
ఎర్రజెండా నేలకొరిగిందని తూర్పున సూర్యుడు పొడిచినంత కాలం
మనిషిలో రక్తం ఉన్నంత వరకు అజేయం విప్లవం...
దానిని ఆపడం ఎవడబ్బతరం...



డాక్టర్ సి.నారాయణరెడ్డి

# అక్టోబర్ విప్లవం.. మానవజాతి కొత్తబాట



దోపిడీ రహిత సమాజాన్ని నిర్మించడంలో మహత్తర అక్టోబర్ విప్లవం మానవ చరిత్రలోనే ఒక గొప్ప ముందడుగు. కార్మికులు, కర్షకులు, మిగిలిన అణగారిన తరగతులు కొత్త సోషలిస్టు సమాజాన్ని నిర్మించడంలో సఫలీకృతమయిన మొట్టమొదటి విప్లవం.

**అక్టోబర్ విప్లవం అంటే..?**

1917లో రష్యాలో జరిగిన అక్టోబర్ విప్లవం ప్రపంచ చరిత్రలో కొత్త అధ్యాయానికి తెరతీసింది. ఈ విప్లవం కొత్త సోషలిస్టు రాజ్యం-సోవియట్ యూనియన్-ఆవిర్భావానికి నాంది పలికింది. కార్మికవర్గ నాయకత్వాన విప్లవోద్యమాన్ని ప్రపంచ పటం మీదికి తెచ్చింది.

1917 నవంబరు 7వ తేదీన రష్యన్ విప్లవం జరిగింది. (పాత రష్యన్ కాలెండర్ ప్రకారం ఇది అక్టోబరు 25వ తేదీ) రష్యా కేంద్ర బిందువుగా మధ్య ఆసియా మొత్తం వ్యాపించిన విస్తారమైన సామ్రాజ్యం జార్ చక్రవర్తి ఆధీనంలో ఉంది. అప్పటి జార్ వ్యవస్థ పెద్ద పెద్ద భూస్వాములతో కూడుకున్నది. సామ్రాజ్యంలోని సుసంపన్నమైన 80 లక్షల హెక్టార్లు జార్ ఆధీనంలో ఉండేది. 28 వేల మంది భూస్వాముల ఆధీనంలో 16.74 మిలియన్ల (1674 కోట్ల) ఎకరాల భూమి ఉండేది.

ఈ రకమయిన అర్థ ఫ్యూడల్ భూస్వామ్యవాద విధానంతో కలిసి పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందడం పరిశ్రమల్లోనూ గనుల్లోనూ గుత్తాధిపత్యానికి దారితీసింది. పెట్టుబడిదారీ విధానం త్వరత్వరగా అభివృద్ధి చెందుతున్నప్పటికీ రష్యా మిగిలిన యూరప్ దేశాలతో పోలిస్తే వెనుకబడే ఉండేది.

1914లో జార్ మొదటి ప్రపంచ యుద్ధంలో చేరాడు. ఇది సామ్రాజ్యవాదుల మధ్యపోరు. ఎందుకంటే ఇక్కడ ప్రత్యర్థులు జర్మనీ, బ్రిటన్, ఫ్రాన్స్, రష్యా లాంటి సామ్రాజ్యవాద శక్తులే. ఇవి వలస దేశాల కోసం, వనరులపై ఆధిపత్యం కోసం పోటీ పడేవి. వీరు లక్షలాది మంది రైతులను, కార్మికులను సైన్యంలో చేర్చుకొని యుద్ధభూమికి పంపారు. జర్మనీతో రష్యా తరపున పోరాడుతూ వేలాది మంది ప్రాణాలు కోల్పోయారు. భూస్వాముల కొరడా దెబ్బలకు బలైన బానిసల్లాగానే ఈ పేద రైతులు ఎన్నో బాధలు పడ్డారు.

**తొలుత ఫిబ్రవరి విప్లవం:**

ఈ పరిస్థితుల వలన ప్రజల్లో తీవ్రమైన అసంతృప్తి బయలు దేరింది. జార్ ఆధిపత్యానికి వ్యతిరేకంగా విప్లవశక్తులు, ముఖ్యంగా బొల్షివిక్ పార్టీ తిరుగుబాటు మొదలు పెట్టాయి. ఈ సామూహిక తిరుగుబాటు 1917 ఫిబ్రవరిలో జరిగింది. జార్ చక్రవర్తి నిరంకుశత్వాన్ని తొలగించి ఆ స్థానంలో కొంత మంది సోషల్ డెమోక్రాట్లు ఉన్నా అత్యధికంగా పెట్టుబడి దారులున్న ప్రభుత్వం ఏర్పడింది. ఈ తాత్కాలిక ప్రభుత్వం ఫిబ్రవరి విప్లవం తరువాత మితవాద శక్తులతో రాజీపడి రష్యాలోని బూర్జువా వర్గానికి కొమ్ము కాయడం మొదలు పెట్టింది. యుద్ధంలో జరిగిన నష్టాల వలన, సైనికులు హతుల వడం వలన ఈ ప్రభుత్వం ప్రజల మద్దతు కోల్పోయింది.

అయితే ఫిబ్రవరి విప్లవం ఒక శక్తివంతమయిన ప్రముఖ సాధనాన్ని సమకూర్చి పెట్టింది అదే 'సోవియట్స్'. అన్ని ప్రముఖ నగరాల్లోనూ, పల్లెల్లోనూ, కార్మికుల, సైనికుల, రైతుల సోవియట్స్ ఆవిర్భవించాయి.

కార్మికుల సోవియట్స్‌లో, మిలిటరీ విభాగాల్లో ఏర్పడిన సోవియట్లల్లో కమ్యూనిస్టు పార్టీకి (బోల్షివిక్కులకు) మద్దతు పెరుగుతూ వచ్చింది. సెప్టెంబరు చివరి నాటికి కార్మికులు, రైతులు, సైనికుల్లో ఈ తాత్కాలిక ప్రభుత్వం పట్ల కోపం పెల్లుబికింది. రాజధాని పెట్రోగ్రాడ్‌లోనూ, మాస్కోలాంటి నగరాల్లోనూ కార్మికులు సోవియట్లను ఏర్పరచుకొని ఆయుధాలతో కొనసాగుతున్న విప్లవాన్ని రక్షించుకోనారంభించారు. రష్యాలోని గ్రామీణ ప్రాంతాల్లో భూస్వాముల నుండి పెత్తందార్ల నుండి, రైతులు, వ్యవసాయ కార్మికులు భూములను తీసేసుకోవడం మొదలుపెట్టారు. సైనికులు తమ సోవియట్లను తామే ఎన్నుకుని యుద్ధం ఆపాలని, శాంతి నెలకొల్పాలని పిలుపునిచ్చారు. లెనిన్ చెప్పినట్లు "సైనికుల్లో అత్యధికులు యూనిఫారమ్ వేసుకున్న రైతులే".

**సోషలిస్టు విప్లవం..**
**అన్ని అధికారాలూ సోవియట్స్‌కే**

ఈ పరిస్థితుల్లో దేశంలో విప్లవం మొదటిస్థాయి బూర్జువా విప్లవ దశ నుండి కార్మికులు, అత్యంత నిరుపేద రైతుల

చేతుల్లోకి అధికారం వెళ్లే రెండోదశకు చేరుకుంటున్నదని బోల్షివిక్ నాయకుడు లెనిన్ ప్రకటించాడు.

'అన్ని అధికారాలూ సోవియట్స్‌కే' అన్న బోల్షివిక్‌పార్టీ పిలుపుతో అక్టోబరు 25 (నవంబరు7) న సాయుధులైన కార్మిక బెటాలియన్లు (ఎర్రసైన్యం), సైన్యంలో ఉన్న విప్లవ సైన్యం తాత్కాలిక ప్రభుత్వాన్ని కూలదోసేందుకు బయలుదేరాయి. ఈ విప్లవం రాజధాని పెట్రోగ్రాడ్‌లో అధికారం హస్తగతం చేసుకోవడంలో సఫలమయింది. తదనంతర వారాల్లో మాస్కోలోనూ, మిగిలిన కేంద్రాల్లో కూడా పాత వ్యవస్థను కాపాడే విశ్వాసపాత్రుల ప్రతిఘటనను సమర్థవంతంగా తిప్పికొట్టి రష్యా అంతటా, మిగిలిన పాత జార్ చక్రవర్తి సామ్రాజ్యమంతటిలోనూ సోవియట్ల అధికారం నెలకొల్పబడింది.

ఈ విప్లవం 'కౌన్సిల్ ఆఫ్ పీపుల్స్ కమీషర్స్' ఆధ్వర్యాన లెనిన్ నాయకత్వాన కొత్త ప్రభుత్వ స్థాపనకు దారితీసింది.

'భూమి, శాంతి, రొట్టె' నినాదంతో బోల్షివిక్‌లు ప్రజలను కదిలించారు. 'ఆల్ రష్యన్, కాంగ్రెస్ ఆఫ్ సోవియట్స్ ఆఫ్ వర్కర్స్, సోల్జర్స్, అండ్ పెజెంట్స్ డిప్యూటీస్' (రష్యాలోని కార్మికుల, సైనికుల, రైతుల, సోవియట్ ప్రతినిధుల సమాఖ్య) ముందు భూమికి, శాంతికి సంబంధించిన మొట్టమొదటి ప్రకటన చేయడం ఈ కొత్త ప్రభుత్వం వేసిన తొలి అడుగు. ఎస్టేట్ల భూమి, చర్చిలు, మొనాస్టరీలకు చెందిన భూమి అందులోని జీవాలు భవనాలతో సహా తీసుకుని ప్రాంతీయ భూ కమిటీలకు, రైతు ప్రతినిధులున్న జిల్లా సోవియట్లకు అప్పగించింది.

యుద్ధాన్ని వెంటనే ఆపాలని, యుద్ధంలో పాల్గొన్న అన్ని ప్రభుత్వాలతో, ప్రజలతో శాంతి చర్చలు జరపాలన్న రెండో ప్రకటన చేయబడింది. ఏ రకమైన విలీనాలు, పరిహారాలు లేకుండా వెంటనే శాంతి ఒప్పందాన్ని అమలు చేయాలన్న దృఢసంకల్పాన్ని కొత్త సోవియట్ ప్రభుత్వం ప్రకటించింది.

నిరక్షరాస్యత నిర్మూలన, సార్వత్రిక ప్రాథమిక విద్య, ఉచిత ఆరోగ్య రక్షణ సదుపాయం, యూనియన్ ఆఫ్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్ నిర్మాణం అనే ఇతర ప్రకటనలు కూడా చేయబడ్డాయి.

జార్ ఆధీనంలో 'దేశాల బందిఖానా'గా రష్యా ఉండేది. రష్యన్ కాని అనేక దేశాలకు వలస దాస్యం నుండి రష్యన్ విప్లవం స్వేచ్ఛనిచ్చింది. స్వతంత్ర సోషలిస్టు రిపబ్లిక్‌ల సమాఖ్యగా ఏర్పరిచింది.

సోవియట్ రాజ్యం సోషలిజాన్ని అమలు చేసే లోపలే విప్లవం ప్రతీఘాత విప్లవ శక్తుల దాడిని ఎదుర్కొంది. అంతర్యుద్ధం మొదలయింది. బోల్షివిక్ వ్యతిరేకులు వైట్ గార్డ్స్‌తోనూ, విప్లవ ప్రతీఘాత శక్తులతోనూ ఎర్రసైన్యం తలపడవలసి వచ్చింది. బ్రిటన్, జర్మనీ, ఫ్రాన్స్‌తో సహా పది పెట్టుబడిదారీ దేశాలు ఆయుధాలిచ్చి, సహాయాన్నందించి విప్లవ ప్రతీఘాత శక్తులకు మద్దతుగా నిలిచాయి.

నాలుగేళ్ల అంతర్యుద్ధం తరువాత విప్లవ ప్రతీఘాత శక్తులను అణచివేసి ఎర్రసైన్యాలు విజయాన్ని సాధించాయి. ఈ మజిలీలో వర్గ చైతన్యం గలిగిన ఎందరో కార్మికులను కర్షకులు ఎర్రసైన్యాలు త్యాగం చేయవలసి వచ్చింది.

**ప్రపంచంలోని మొట్టమొదటి సోషలిస్టు విప్లవం అని దీన్నెందుకంటాం:**

అంతకు ముందు జరిగిన విప్లవాలన్నింటికన్నా అక్టోబరు విప్లవం భిన్నమైంది. 1789 ఫ్రెంచి విప్లవం మొదలు పాత ఫ్యూడల్ తరగతుల నుండి రాజరికాల నుండి, రాజ్యాధికారాన్ని అనేక విప్లవాలు తొలగించాయి.

చరిత్రలో కొత్తగా ఎదుగుతున్న దోపిడీదారులు పాతతరం దోపిడీదారులను అధికారం నుండి పడదోసే సందర్భాల్లో విప్లవాలు వచ్చాయి. పాత ఫ్యూడల్ దోపిడీ తరగతులను బూర్జువా నాయకత్వాన విప్లవాలు తొలగించినప్పుడూ ఇదే జరిగింది.

కానీ అక్టోబర్ విప్లవం చాలా ప్రత్యేకమైంది. ఈ విప్లవం మొట్టమొదటిసారి కార్మిక వర్గం, పేద రైతాంగం తదితర అణగారిన వర్గాలు నాయకత్వం వహించి పెట్టుబడిదారీ దోపిడీవర్గాన్ని కూల్చివేసింది.

రష్యాలోని విప్లవానికి కార్మికవర్గం నాయకత్వం వహించడం వల్లనే అక్టోబరు విప్లవం ప్రపంచంలోనే మొదటి సోషలిస్టు విప్లవంగా గుర్తించబడింది. పాత రాజ్యాధికారం నాశనం అయి, కొత్త రాజ్యాధికారం ఏర్పరచినప్పుడే విప్లవం విజయవంతమయినట్టు అని లెనిన్ అన్నారు. రష్యన్ విప్లవంలో ఇదే జరిగింది. ఇది పాత రాజ్యాధికారాన్ని తొలగించి దాని స్థానంలో సోవియట్స్ రూపంలో కొత్త రాజ్యాన్ని ఏర్పరచింది. ఈ సోవియట్స్ కార్మిక కర్షకుల ప్రయోజనాలు కాపాడేవి.

సోషలిజం అంటే ఉత్పత్తి సాధనాలు సమాజపరం కావడమే. పరిశ్రమలు, భూమి, వ్యవసాయం ఇతర ఉత్పత్తి సాధనాలు రాజ్యం తన అధీనంలోకి తీసుకుని వాటిని సమష్టి యాజమాన్యం కిందికి తెస్తుంది.

మొదటి సారిగా ప్రపంచంలోనే కొత్త సోషలిస్టు ఉత్పత్తి విధానం ఏర్పడింది.

**విప్లవం విజయాలు:**

1960 వరకు సోవియట్ యూనియన్‌లో గొప్ప ఆర్థికాభివృద్ధి జరిగింది. అతి పెద్ద విమర్శకులు కూడా ఈ విషయాన్ని అంగీకరిస్తారు. గౌరవనీయుడైన బ్రిటిష్ ఆర్థిక చరిత్రకారుడు అన్‌గస్ మడిసన్ ఇలా అన్నారు. "1918-1965 మధ్యకాలంలో సోవియట్ తలసరి ఆదాయం ప్రపంచంలోనే అత్యంత వేగవంతంగా పెరిగింది. జపాన్ కంటే వేగంగా పెరిగింది. జపనీయులు 400 శాతం వృద్ధిని సాధిస్తే సోవియట్ 440 శాతం వృద్ధి సాధించి అభివృద్ధి చెందిన అన్ని దేశాల కంటే ఉత్పత్తిలో ఆధిక్యతను సాధించింది."

1. అంతర్యుద్ధం ముగిసిన దశాబ్దికాలంలో నిరక్షరాస్యతను పూర్తిగా నిర్మూలించడం.
2. సార్వజనీన ఏడేళ్ల విద్య, సార్వజనీన మాధ్యమ (పదేళ్ల) విద్య, సార్వజనీన ప్రాథమిక విద్యకు కొనసాగింపుగా ఉండే విధంగా నిబంధనలు చేయబడ్డాయి. ఇది ఆ కాలంలో మరే ఇతర యూరోపియన్ దేశంలోనూ లేదు.
3. భూస్వామ్య వ్యవస్థ రద్దు. సమష్టి సహకార క్షేత్రాలు పేద రైతులు వ్యవసాయ కార్మికులతో ఏర్పాటు.



4. విప్లవం పూర్తయిన వెనువెంటనే పౌరులందరికీ ఉచిత వైద్య సదుపాయాలు అమలు చేయబడ్డాయి.
5. అందరికీ ఉద్యోగం, నిరుద్యోగ నిర్మూలన. 1936 నాటికల్లా అందరికీ ఉద్యోగాలు కల్పించిన కారణంగా ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజ్‌లు మూతబడ్డాయి.
6. కొత్త ప్రభుత్వం తీసుకున్న తొలి నిర్ణయాల్లో మహిళలందరూ సమాన హక్కులు, సమాన వేతనాలు, ప్రసూతి సౌకర్య హక్కులు, విడాకుల హక్కులు పొందారు. విప్లవం మహిళలకు ఓటు హక్కునిచ్చింది. ఈ హక్కు బ్రిటన్ మహిళలకు 1928లో గానీ లభించలేదు.
7. ప్రజలకు సాంస్కృతిక వనరులు విస్తృతంగా అందుబాటులోకి వచ్చాయి. పుస్తక ప్రచురణలకు, సినిమాల నిర్మాణానికి, సంగీతానికి, కళలకు ప్రభుత్వం నిధులు సమకూర్చింది.

**చరిత్రపై అక్టోబర్ విప్లవ ప్రభావం:**

1917కు ముందు ప్రపంచం, ఈ రోజు ఉన్న దానికన్నా ఎంతో భిన్నంగా ఉండేది. 20వ శతాబ్దపు తొలిరోజులు ఇంకా సామ్రాజ్యవాద యుగమే. వలస వాదం శిఖరాగ్రంలో ఉన్న రోజులు. బ్రిటీష్, జర్మన్, ఫ్రెంచ్, ఆస్ట్రో-హంగేరియన్, రష్యన్, జపనీస్ సామ్రాజ్యాలు ఆధిపత్యం చలాయించి ప్రపంచాన్ని విభజించిన రోజులు. పోర్చుగీసు, ఇటలీ లాంటి భిన్న సామ్రాజ్యాలూ ఉండేవి. ప్రపంచంలోని అత్యధిక దేశాలు వలస దేశాలుగానో, పాక్షిక వలస దేశాలుగానో ఈ సామ్రాజ్యవాదుల ఆధీనంలో ఉండిన రోజులు.

రష్యన్ విప్లవం ఈ తరహా పాత వలస వాదానికి చరమగీతం పాడింది. అక్టోబర్ విప్లవానికన్నా ముందే ప్రారంభం అయిన మొదటి ప్రపంచ యుద్ధం ఆరంభంలోనే వలసవాదానికి చావుదెబ్బ తగిలింది. జార్ చక్రవర్తి సామ్రాజ్యం పతనమయిన ఏభైఏళ్లకి మరే సామ్రాజ్యం మిగల్లేదు.

అక్టోబర్ విప్లవం విసిరిన అగ్నికణం వరుసగా ఎన్నో దేశాల్లో విముక్తి పోరాటాలను రగిలించి, సామ్రాజ్యవాద పాలనను అంతం చేసింది. మొట్టమొదటి సోషలిస్టు విప్లవం జయప్రదమవడంతో సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం మరో ముందడుగు వేసింది. రష్యన్ విప్లవమే ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాల్లోని జాతీయోద్యమాలకు స్ఫూర్తినిచ్చింది. సోవియట్ యూనియన్ ఈ విముక్తి పోరాటాలకు మద్దతునిచ్చింది.

అక్టోబర్ విప్లవం కార్మిక కర్షక ఐక్యత పునాదిపై నిర్మించబడింది. ఈ కార్మిక కర్షక ఐక్యత ఆధారంగానే తరువాతి కాలంలో వలసవాదానికి, పాక్షిక వలస వాదానికి వ్యతిరేకంగా సమీకరణలు జరిగాయి. అక్టోబర్ విప్లవం అడుగుజాడల్లోనే మూడు దశాబ్దాల తరువాత కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో అత్యంత ప్రభావవంతమైన చైనా విప్లవం నడిచింది. వియత్నాం, కొరియాలో విప్లవాలు వీటి ననుసరించే జరిగాయి. ఈ విప్లవాలన్నీ 1930లో పెరిగిన సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫాసిస్టు వ్యతిరేక పోరాటాల వారసత్వంగా వచ్చినవే. రెండో ప్రపంచ యుద్ధం తరువాత సోషలిస్టు ధృువం ఏర్పడడం వీటన్నింటి ఉచ్ఛస్థితి.

20వ శతాబ్దంలోని అత్యంత దుర్మార్గమైన ఫాసిజం అంతం కావడానికి సోవియట్ యూనియన్, అది చేసిన పోరాటాలే ముఖ్య కారణం. ఫాసిజానికి వ్యతిరేకంగా జరిగిన ఈ ప్రజాయుద్ధంలో రెండు కోట్లకు పైగా సోవియట్ ప్రజలు తమ ప్రాణాలను బలిఇచ్చారు. నాజీ యుద్ధవ్యూహాన్ని ఛిద్రం చేసింది ఎర్రసైన్యమే.

అక్టోబర్ విప్లవం దాస్య విముక్తి చేసిన తీరు ప్రపంచాన్నెంతగానో ప్రభావితం చేసింది. రష్యన్ విప్లవం సఫలమవడం వలన దాని ప్రభావం కార్మిక విప్లవోద్యమాలపైనా పడింది.

రష్యాలో సోషలిస్టు విధానాలు అమలు చేయడం వలన రెండో ప్రపంచయుద్ధం తరువాత కాలంలో పశ్చిమ దేశాల్లో కూడా పెట్టుబడిదారులు ప్రజా సంక్షేమ పథకాలు అమలుచేసి తీరవలసిన పరిస్థితులు ఏర్పడ్డాయి.

ఈ దేశాల్లోని కార్మికోద్యమాలు అక్కడ కూడా సార్వజనీన విద్య, వైద్య సదుపాయాలు అందుబాటులోకి వచ్చేందుకు దోహదపడ్డాయి.

**భారతదేశంపై ప్రభావం:**

అక్టోబర్ విప్లవ వార్తలు భారత జాతీయ కాంగ్రెస్ పైన, బయటవున్న ఎన్నో విప్లవ సంఘాలపైన తీవ్రమైన ప్రభావాన్నే చూపాయి.

1. కాంగ్రెస్‌లోని మితవాదులతో అసంతృప్తి చెందిన బాలగంగాధర తిలక్, బిపిన్ చంద్రపాల్, లాలా లజపతిరాయ్, సి.ఆర్ దాస్ లాంటి మధ్యే వాదులంతా రష్యన్ విప్లవ విజయాన్ని ఆహ్వానించి కార్మికవర్గ సంఘాలను ఏర్పరచేందుకు సుముఖత చూపారు.
2. రష్యన్ విప్లవ ప్రభావం వలన భారతదేశంలో సంఘటిత కార్మికోద్యమం మొదలయింది. 1918కి ముందు పారిశ్రామిక కార్మికులను సంఘటితం చేసేందుకు తీవ్ర ప్రయత్నాలు జరగలేదు. కొన్ని చెదురుమదురు సమ్మెలు మాత్రం జరిగాయి. 1918లో కార్మికోద్యమం ప్రారంభమవగా 1919-1921 మధ్య సంఘటిత కార్మికోద్యమాలు వెల్లువెత్తాయి. దేశం సమ్మెలతో అట్టుడికింది.
3. రష్యన్ విప్లవం గురించి తెలుసుకునేందుకు ముజాహిర్ గ్రూప్ ఆఫ్ఘనిస్థాన్ గుండా రష్యా బయలు దేరింది. ఖిలాఫత్ ఉద్యమ ఫలితాలపట్ల తీవ్ర

అసంతృప్తికి గురైన స్వాతంత్ర్య సమర యోధులున్నారు. అందులో కొందరు భారత కమ్యూనిస్టు పార్టీ తొలి సభ్యులయ్యారు.

4. సుబ్రమణ్య భారతి, కాజీ నజుల్ ఇస్లామ్, రవీంద్రనాథ్ ఠాగూర్ లాంటి ప్రముఖ రచయితలు, కవులు రష్యా విప్లవ వార్తలను స్వాగతించారు. అక్టోబర్ విప్లవం జరిగిన కొన్ని వారాల్లో సుబ్రమణ్య భారతి, 'కొత్తరష్యా' గేయాన్ని రాశారు. 1930లో రవీంద్రనాథ్ ఠాగూర్ రష్యాలో పర్యటించారు. కొత్త సమాజ నిర్మాణంతో ముగ్ధుడయిన ఆయన 'రష్యా నుంచి ఉత్తరాలు' (లెటర్ ఫ్రమ్ రష్యా)లో ఇలా అన్నారు.

"నా కళ్లతో నేను చూడకపోయి ఉంటే పది సంవత్సరాల్లో లక్షలాది ప్రజలను అజ్ఞానాంధకారం నుంచి, అవమానాల నుండి వెలుగులోకి తెచ్చి, వారికి చదవడం, రాయడం నేర్పించడమేకాక, వారిలో గౌరవ ప్రదమైన మానవ జీవితాన్ని నింపగలరని నమ్మి ఉండేవాడిని కాదు. ఇక్కడి విద్యా విధానాన్ని అధ్యయనం చేసేందుకు మనం ఇక్కడికి వచ్చి తీరాలి."

1930లో సోవియట్ యూనియన్ సందర్శించిన ఎందరో, జవహర్‌లాల్ నెహ్రూ నుండి పెరియర్ రామస్వామి వరకు, సోషలిస్టు సోవియట్ యూనియన్ విజయాల పట్ల ముగ్ధులయ్యారు.

భగత్‌సింగ్, ఆయన సహచరులు సోషలిజం వైపునకు ఆకర్షితులయ్యేందుకు రష్యా విప్లవం, లెనిన్ భావాలు కారణ మయ్యాయి. 1930 జనవరి 21వ తేదీ కోర్టులో విచారణను ఎదుర్కొంటూ భగత్ సింగ్, ఆయన సహచరులూ మాస్కోకు ఈ టెలిగ్రామ్ పంపారు.

"లెనిన్ ఆశయాలను ముందుకు తీసుకుని వెళ్లేందుకు ఏ కొంచమయినా శ్రమిస్తున్న వారికి మా అభినందనలు. రష్యా చేస్తున్న ఈ ప్రయోగం విజయవంతం కావాలని ఆకాంక్షిస్తున్నాం. అంతర్జాతీయ కార్మికోద్యమంతో గళం కలుపుతాం".

అందువలన భారతదేశ స్వాతంత్ర్య పోరాటంపైనా రష్యా విప్లవ ప్రభావం ప్రగాఢంగా ఉంది.

## సోవియట్ యూనియన్ ఎలా అంతం అయింది..?

పెట్టుబడిదారుల ముట్టడి, అంతర్యుద్ధాల మధ్య రష్యా విప్లవం విజయవంతమయితే ఆ తరువాత సోవియట్ యూనియన్ ఏర్పడింది. ఈ కొత్త సోషలిస్టు రాజ్యం సామ్రాజ్యవాదం నుండి నిరంతరం బెదిరింపులను ఎదుర్కోవలసి వచ్చింది. ఫాసిస్టు దాడులు దీనినే గురిచేసుకున్నాయి. ఈ సవాళ్లనన్నింటినీ ఎదుర్కొంటూనే ప్రపంచ యుద్ధం తరువాత రష్యా ఒక కొత్త శక్తిగా వెలిగి అమెరికా తరువాతి స్థానానికి చేరింది. సత్వర ఆర్థికాభివృద్ధి, సార్వత్రిక విద్య, వైద్యం, గృహవసతి, సాంస్కృతిక, భౌతిక జీవన ప్రమాణాల మెరుగుదల సోషలిస్టు వ్యవస్థలోని అంతర్గత సామర్థ్యాన్ని చూపింది.

అయినా కొంతకాలం తరువాత, ముఖ్యంగా చివరి ఇరవై సంవత్సరాల్లో కొన్ని లోపాలు బయటపడ్డాయి. ఆర్థిక వ్యవస్థ కొత్త శాస్త్రీయ జ్ఞానాన్ని, టెక్నాలజీ విప్లవాన్ని అందిపుచ్చుకునేందుకు తయారుగా లేదు. ఆర్థిక వ్యవస్థను అవసరాల కనుగుణంగా మార్పు చేయడంలో విఫలమయ్యింది. ప్రజల భౌతిక అవసరాల కనుగుణంగా సామ్యవాద ప్రజాస్వామ్యాన్ని అభివృద్ధి చేయడంలో వైఫల్యం చెందింది. వీటితో పాటుగా ప్రజల్లో సామాజిక చైతన్యాన్ని పెంచే కమ్యూనిస్టు పార్టీ సైద్ధాంతిక వైఫల్యం బ్యూరోక్రసీకి దారి తీసింది. ఫలితంగా సోవియట్ యూనియన్ పతనమయ్యింది.

సోవియట్ యూనియన్ పతనానికి కారణం సోషలిజంకాదు. సోషలిజం నిర్మించడంలోని వక్రీకరణలు, సైద్ధాంతిక ఉల్లంఘనలు. సోవియట్ యూనియన్‌లో సోషలిజం నిర్మించిన అనుభవాన్ని చారిత్రికంగా పునస్సమీక్షించుకుంటే ఈనాడు ప్రపంచంలో సోవియట్ యూనియన్ పతనం సోషలిజం ప్రాసంగికతకు అంతం కాదని స్పష్టంగా తెలుస్తుంది.

**అక్టోబర్ విప్లవం ప్రాసంగికత:**

పెట్టుబడిదారీ విధానాన్ని అంతం చేయవచ్చని సోషలిజాన్ని నిర్మించవచ్చని అక్టోబర్ విప్లవం మానవజాతికి చూపింది.

20వ శతాబ్దంలో శక్తివంతమైన ప్రభావాన్ని చూపిన అక్టోబర్ విప్లవం, 21వ శతాబ్దంలోనూ ప్రత్యామ్నాయ బాటకు వెలుగులు విరజిమ్ముతూనే ఉంది.

సోవియట్ యూనియన్ పతనం పెట్టుబడిదారీ ప్రపంచ ఆధిపత్యానికి, సామ్రాజ్యవాదానికి దారితీసింది. 21వ శతాబ్దంలో నయా ఉదారవాద విధానాలను అనుసరిస్తున్న పెట్టుబడిదారీ విధానం ప్రపంచాన్ని కచ్చితమైన రెండు భాగాలుగా విభజించింది. కొద్దిమంది ధనవంతులు ఒకవైపు, పేదరికంతో, నిరుద్యోగంతో, ఆకలితో అల్లాడుతున్న కోట్లాది మంది ప్రజలు మరోవైపు.

అసమానతలు విపరీతంగా పెరిగాయి. ప్రపంచంలోని ఒక శాతం మంది ప్రజలు రూ.కోటీ 10 లక్షల కోట్ల ఆస్తులకు అధిపతులు. అంటే కింది సగం జనాభా కన్నా 65 రెట్లు ఎక్కువ సంపద కలిగి ఉన్నారు. ప్రపంచంలో 130 కోట్ల జనాభా అత్యంత పేదరికంలో మగ్గుతున్నారు.

అమెరికా ఆధ్వర్యంలో సామ్రాజ్యవాదం తన ఆధిపత్యం కొనసాగించే ప్రయత్నంలోనే ఉంది. ఇరాక్, సిరియా, లిబియా, యెమెన్, ఆఫ్ఘనిస్థాన్ వంటి దేశాల్లో వినాశకర ఘర్షణలను ఎగదోసి, వాటిలో జోక్యం చేసుకుంటోంది.

నయా ఉదారవాద విధానాలకు పొదుపు పేరుతో సాగిస్తున్న దుశ్చర్యలకు అణచివేతకు వ్యతిరేకంగా ప్రపంచవ్యాప్తంగా కార్మికులు, శ్రమచేసే ఇతర తరగతుల ప్రజలూ పోరాటాలు చేస్తున్నారు. వీరందరికీ 1917 సోషలిస్టు విప్లవం దిశానిర్దేశం చేసే వెలుగుకిరణం.

ప్రగతిశీల విప్లవ శక్తులకు అక్టోబర్ విప్లవం ప్రేరణనిచ్చే ఆశా కిరణం. వర్గరహిత, దోపిడీ రహిత సమాజం కోసం కృషిచేసే వారందరికీ అక్టోబర్ విప్లవం భవిష్యత్ సోషలిజానిదే అన్న సందేశాన్ని ఇస్తుంది.

(అక్టోబర్ విప్లవం బుక్‌లెట్ నుండి)

# భారతదేశం పై అక్టోబర్ విప్లవ ప్రభావం

**హరికిషన్ సింగ్ సూర్జిత్**

1917 అక్టోబర్ మహావిప్లవం మానవ చరిత్రలో ఒక నూతనాధ్యాయాన్ని ప్రారంభించింది. పెట్టుబడిదారీ విధానం నుంచి సమాజం సోషలిజానికి పరివర్తన చెందే అధ్యాయం అది. మొత్తం ప్రపంచ సంఘటనల గమనంపై అది ప్రభావం చూపనారంభించింది. మార్క్సిజం అన్నది ఊహాజనితమైంది తప్ప ఎక్కడా ఆచరణలోకి రాలేదంటూ అప్పటి వరకూ ప్రచారం సాగించిన సామ్రాజ్యవాదులు భీతావహులై సోషలిజం పీకనులిమేందుకు బహిరంగ జోక్యానికి పాల్పడ్డారు. అక్టోబర్ విప్లవాన్ని ఓడించేందుకై 14 దేశాలు చేతులు కలిపాయి. కానీ లెనిన్ సారథ్యంలో కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన రష్యన్ ప్రజానీకం వారిని ఓడించారు. అభివృద్ధి చెందుతున్న కొన్ని దేశాల్లో సోషలిస్టు విప్లవాలు జయప్రదమయ్యేంత వరకూ ఈ విప్లవం ఆచరణ సాధ్యం కాదన్న ఇదివరకటి అవగాహనతో పోల్చితే ఏ ఒక్క దేశంలోనైనా సోషలిజాన్ని నెలకొల్పవచ్చునని లెనిన్ నిరూపించగలిగారు. ఇదేదో ఆదర్శ పవిత్ర భావం మాత్రమే కాదు. ప్రపంచానికి చరిత్ర నిరూపించిన నగ్న సత్యం.

**యావత్ ప్రపంచంపై ప్రభావం**

సోవియట్ యూనియన్‌లో సోషలిజాన్ని నెలకొల్పడంలో, ఫాసిస్టు మూకలను ఓడించి ప్రపంచాన్ని వినాశనం బారి నుండి కాపాడటంలో, ప్రపంచ శక్తుల బలాబలాలను మార్చడంలో, అంటే ప్రత్యక్ష వలస పాలనను అంతమొందించడంలో, ప్రపంచ వ్యాప్తంగా 'మార్క్సిజం - లెనినిజం' సందేశాన్ని వినిపించడంలో మహత్తర అక్టోబర్ విప్లవం నిర్వహించిన అద్భుత పాత్ర గురించి అనేక రచనలు వెలువడ్డాయి. అక్టోబర్ విప్లవం పెట్టుబడిదారీ దేశాల్లోని కార్మిక వర్గంపై ప్రభావం చూపింది. ఆ దేశాల్లోని కార్మిక వర్గానికి పాలక వర్గాలు పలు రాయితీలు ఇవ్వక తప్పని పరిస్థితి అక్టోబర్ విప్లవ ప్రభావం ఫలితమే.

కానీ సామ్రాజ్యవాదం ఏనాడూ సోషలిజంతో రాజీ పడలేదు. బహిరంగ యుద్ధం, అంతర్గతంగా విద్రోహాలకు పాల్పడి ప్రపంచ కార్మిక వర్గం, లక్షలాది శ్రామిక ప్రజల నూతన ఆశాజ్యోతిని ఆర్పేందుకు సామ్రాజ్యవాదం రకరకాల పద్ధతుల్లో ప్రయత్నించింది. కానీ 80వ దశకం చివరి వరకూ అది దాని యత్నాల్లో విఫలమవుతూ వచ్చింది. ఇక ఇప్పుడు కమ్యూనిజానికి భవిష్యత్తు లేదని, సమాజ పురోభివృద్ధికి తాము మాత్రమే ప్రత్యామ్నాయాన్ని కల్పించగలమని సామ్రాజ్యవాదులు చెబుతున్నారు. కానీ వారు పొరబడ్డారు. ఎందుకంటే ఇది సమాజాన్ని ముందుకు నడిపించడంలో వర్గ పోరాటం ముఖ్యమైన పాత్ర నిర్వర్తిస్తుందని చెప్పే చారిత్రక, భౌతికవాద సిద్ధాంతానుసారం సంభవిస్తున్న చారిత్రక పరిణామాల క్రమానికి విరుద్ధమైంది. పెట్టుబడిదారీ విధానం అన్నది మనిషిని మనిషి దోచుకోవడంపై ఆధారపడింది గనుక అది సమాజ రుగ్మతలకు పరిష్కారం చూపలేదు. సోషలిజం తన లోటు పాట్లను, ఎదురు దెబ్బలను అధిగమించి తిరిగి తన శక్తి సామర్థ్యాలను పొంది, సమాజ పరిణామాలను ప్రభావితం చేయడం తథ్యం. అక్టోబర్ మహా విప్లవం చరిత్ర గమనానికి మార్గదర్శిగా కొనసాగుతుంది. అక్టోబర్ విప్లవపాత్రను చరిత్ర పుటల నుంచి ఈ ప్రపంచంలో ఎవరూ తుడిచి వేయలేరు.

**భారత పోరాటంపై ప్రభావం**

స్వాతంత్ర్యానికి ముందు, ఆ తర్వాత మనదేశంలో పరిణామాలను అక్టోబర్ విప్లవం ఎలా ప్రభావితం చేసిందనేది మన సొంత అనుభవానికే ఇక్కడ పరిమితమవుదాం.

మొదటి ప్రపంచ యుద్ధం చివర్లో అక్టోబర్ మహా విప్లవం జరిగింది. 1880 దశకం మధ్య నుంచే మనదేశంలో



స్వాతంత్ర్యం కోసం పలు పోరాటాలు జరిగినప్పటికీ దేశ వ్యాప్తంగా మన జాతీయ విమోచనోద్యమం మొదటి ప్రపంచ యుద్ధం ముగిసే నాటికి రూపు దిద్దుకోనారంభించింది.

మొదటి ప్రపంచ యుద్ధం బ్రిటిష్ పాలకుల తరపున పోరాడుతున్న అనేక మంది భారతీయ సైనికుల ప్రాణాలను బలిగొన్నది. బ్రిటిష్ పాలకులు అనేక వాగ్దానాలు చేశారు. కానీ తర్వాత వాటిని విస్మరించారు. అది మన ప్రజానీకంలో తీవ్ర అసంతృప్తికి దారి తీసింది. ఈ పరిస్థితుల్లో అక్టోబర్ మహా విప్లవం జయప్రదమైందన్న వార్త మన ప్రజలకు చేరింది. ఆ రోజుల్లో కమ్యూనికేషన్ సంబంధాలు చాలా పరిమితంగానే ఉన్నప్పటికీ అక్టోబర్ విప్లవ సందేశం భారత్‌కు చేరింది. భారతీయ నాయకులు అక్టోబర్ విప్లవం గురించి మాట్లాడడం మొదలు పెట్టారు. అక్టోబర్ విప్లవ రథసారథి లెనిన్ చేసిన శాంతి ప్రకటన, వలస దేశాల్లో విమోచన కోసం సాగిస్తున్న ప్రజా పోరాటాలకు అక్టోబర్ విప్లవ బహిరంగ మద్దతు ప్రపంచంలోని వివిధ ప్రాంతాల్లో నూతనోత్సాహాన్ని కలిగించింది.

ఈ రోజు భారతదేశంలో మనం ఆనాటి జాతీయోద్యమ గొప్ప నాయకులైన లాల్ బాల్ పాల్ (లాలా లజపతిరాయ్, బాల గంగాధర్‌తిలక్, బిపిన్ చంద్రపాల్) శతజయంత్యుత్సవాలను జరుపుకొంటున్నాం. లెనిన్ పిలుపునకు మొట్టమొదట ప్రతిస్పందించింది వారే. లాలా లజపతిరాయ్ స్వాతంత్రోద్యమంలో కార్మికవర్గ ప్రముఖపాత్రను గుర్తించ గలిగారు. 1921లో ఏఐటీయూసీ ఏర్పడిన అనంతరం దాని అధ్యక్షుడయ్యారు. అక్టోబర్ విప్లవాన్ని కొనియాడుతూ, దాని

ప్రాధాన్యతను భారత ప్రజానీకానికి వివరిస్తూ "రష్యానేత లెనిన్ గురించి" పేరిట బాల గంగాధరతిలక్ ఒక వ్యాసం రాశారు. అన్ని రకాల ఆర్థిక, పెట్టుబడిదారీ దోపిడీకి వ్యతిరేకంగా, సామాజిక అసమానతలకు వ్యతిరేకంగా పోరాటానికి బోల్షివిక్‌లు పిలుపునిస్తున్నారని, 1919 డిసెంబర్ 14న జాతీయ విమోచనోద్యమ ప్రముఖ నాయకుల్లో ఒకరైన బిపిన్ చంద్రపాల్ ప్రకటించారు. ఈ బోల్షివిక్ సిద్ధాంతాన్ని ప్రకటించే డాక్యుమెంటుపై సంతకాలు చేసేందుకు అన్ని చోట్ల శాస్త్ర, సాహిత్య, తత్వ శాస్త్ర రంగాల్లో ప్రముఖులైన వారంతా సిద్ధంగా ఉన్నారని ఆయన ఉద్ఘాటించారు.

**రైతు సంఘాల పెరుగుదల**

భూమికి సంబంధించి లెనిన్ జారీ చేసిన డిక్రీ గురించి తెలియడంతో మనదేశంలోని రైతాంగం పెద్ద ఎత్తున స్పందించింది. 20వ దశకం ఆరంభంలో బీహార్, యు.పి. బెంగాల్, పంజాబ్, సెంట్రల్ ప్రావిన్స్‌లలో కిసాన్ సభలు, రైతు సంఘాలు, బేగార్ వ్యతిరేక ఉద్యమాల రూపంలో రైతు సంఘాలు రంగంలోకి వచ్చాయి. జమీందారీ వ్యవస్థకు వ్యతిరేకంగా నడిచిన ఉద్యమాలవి. రైతాంగ అల్లర్లుగా చెప్పబడేవి దేశంలోని వివిధ ప్రాంతాల్లో చెలరేగాయి. 1920 ఆగస్టు 28-29లో రంగాపూర్‌లో జరిగిన రైతు సదస్సులో 'నాయక్' అనే వార్తపత్రిక సంపాదకుడు పి. బెనర్జీ భూస్వాముల భూములను ఆక్రమించుకోవలసిందిగా రైతాంగానికి పిలుపునిచ్చారు. స్వాతంత్ర్య పోరాటం దాని తుది లక్ష్యాన్ని చేరాలంటే కార్మిక వర్గాన్ని, రైతాంగాన్ని సమీకరించాల్సిన అవసరాన్ని జాతీయ నాయకులు, పలువురు మేధావుల దృష్టికి తెచ్చింది. అక్టోబర్ మహా విప్లవం ప్రభావంతోనే కార్మిక వర్గం తన తొలి అఖిల భారత సంఘమైన ఏఐటీయూసీని 1921లో ఏర్పాటు చేసుకోగలిగింది.

**గదర్ పార్టీపై ప్రభావం**

అదే కాలంలో అమెరికాలో ఉంటున్న గదర్ పార్టీ సాయుధ దళాల్లో తిరుగుబాటు లేవ దీసి మనదేశంలో విప్లవాన్ని తేవాలని ప్రయత్నించింది. ఇలా ప్రయత్నించిన గదర్ వీరులను అనేక మందిని ఉరి కంబాలెక్కించారు. అనేక మందికి యావజ్జీవ కారాగార శిక్ష విధించారు. వారు కూడా అక్టోబర్ విప్లవం ద్వారా ప్రభావితులయ్యారు. రష్యన్ కమ్యూనిస్టు పార్టీతో సంబంధాలేర్పరుచుకున్నారు. వారి నాయకులిరువురు భాయ్ రతన్‌సింగ్, సంతోష్ సింగ్‌లు 1921-22లో రహస్యంగా సోవియట్ యూనియన్‌కు వెళ్లి లెనిన్‌ను కలుసుకోగలిగారు. అవి చాలా గడ్డు రోజులు. కానీ వారు అక్టోబర్ విప్లవం సాధించిన విజయాల పట్ల, ఆ రోజుల్లో సోవియట్ ప్రజానీకంలో వెల్లివిరిసిన ఉత్సాహాన్ని చూసి ఎంతగానో ముగ్ధులయ్యారు. లెనిన్, ఆయన భావాలపట్ల వారెంతగా స్ఫూర్తి పొందారంటే వారు అమెరికాకు తిరిగి వచ్చి అక్టోబర్ విప్లవం ఏ లక్ష్య సాధన కోసం జరిగిందో ఆ లక్ష్య సాధన కోసం పని చేయాలని నిర్ణయించుకున్నారు.

తదనంతరం గదర్ పార్టీకి చెందిన అన్ని శాఖలూ మాస్కోలో లెనిన్ స్థాపించిన 'యూనివర్సిటీ ఆఫ్ టాయిలర్స్ ఆఫ్ ది ఈస్ట్'కు విద్యార్థులను పంపించనారంభించాయి. జాతీయ స్వాతంత్ర్య పోరాటాలకు తగిన సూచనలు సలహాలిచ్చి, అంతిమంగా దోపిడీ రహిత సమాజం స్థాపించాలనే మహత్తర లక్ష్యాన్ని పొదుగొల్పే ఉద్దేశంతో లెనిన్ ఈ విశ్వవిద్యాలయాన్ని నెలకొల్పారు. అమెరికా, పనామా, అర్జెంటీనా, కెన్యా తదితర ప్రాంతాల నుంచి పెద్ద ఎత్తున కార్యకర్తలను ఈ విశ్వవిద్యాలయానికి పంపారు. అక్కడి నుంచి వారు భారత్‌కు తిరిగి వచ్చిన అనంతరం స్వాతంత్ర్యోద్యమం కోసం, ఇక్కడ కమ్యూనిస్టు ఉద్యమాన్ని పెంపొందించేందుకు పని చేయనారంభించారు. అక్టోబర్ విప్లవ లక్ష్యానికి ఆకర్షితులైన గదర్ పార్టీ వారు కూడా పంజాబ్‌లో కమ్యూనిస్టు ఉద్యమ అభివృద్ధికి పలు విధాల దోహదపడ్డారు.

**ఇతర విప్లవకారుల మద్దతు**

బ్రిటిష్ ప్రభుత్వంచే బహిష్కృతులై విదేశాల్లో కాబూల్ లేదా బెర్లిన్‌లలో ఉంటున్న భారతీయ విప్లవకారులు కూడా అక్టోబర్ విప్లవానికి సత్వరం ఆకర్షితులయ్యారు. ప్రవాసంలో ఏర్పాటైన భారత రిపబ్లిక్ ప్రభుత్వ అధ్యక్షుడు ప్రొఫెసర్ మహ్మద్ బర్కతుల్లా, ఒబీదుల్లా సింధి, రాజ మహేంద్ర ప్రతాప్‌లు వారిలో ప్రముఖులు. బర్కతుల్లా 1919మే 7న లెనిన్‌ను కలుసుకున్నారు. ఆయనొక ప్రకటనలో ఈ విధంగా పేర్కొన్నారు. "బ్రిటిష్ వారిని ఆసియా నుంచి తరిమి కొట్టడమే నా జీవిత ధ్యేయం. ఆసియాలో బ్రిటిషు వారు ప్రాతినిధ్యం వహించే ఐరోపా పెట్టుబడిదారీ విధానానికి రాజీ లేని శత్రువుని''. పెట్టుబడిదారులపైనా, ముఖ్యంగా ఆంగ్లేయులపైనా పోరాడవలసిందిగా సోవియట్ ప్రభుత్వం ఇచ్చిన పిలుపు తన పైనా, తన మిత్రులపైనా గొప్ప ప్రభావం కలిగించిందని ఆయన పేర్కొన్నారు. సామ్రాజ్యవాద ప్రభుత్వాలు విధించిన రహస్య ఒడంబడికలన్నింటినీ రష్యా తోసిపుచ్చడం, చిన్నవైనా, పెద్దవైనా అన్నిదేశాల ప్రజలకూ జాతీయ స్వయం నిర్ణయాధికార హక్కు ఉండాలన్న దాని ప్రకటన ఆయన్ను అన్నింటి కన్నా ఎక్కువగా ఆకట్టుకున్నది.

సోవియట్ తీసుకున్న ఈ చర్యే ఆసియాలో పీడిత ప్రజలను సోవియట్ రష్యా వైపు ఆకట్టుకుంది. ఎం.ఎన్.రాయ్, అజయ్ ముఖర్జీ, అబ్దుల్ సత్తార్, అబ్దుల్ అల్సార్ వంటి వారెందరో అక్టోబర్ విప్లవంతో స్ఫూర్తి పొందారు.

ఖిలాఫత్ ఉద్యమంలో అనేక మంది యువ భారతీయ ముస్లింలు టర్కీ రక్షణకు అక్కడకు వెళ్లాలని భావించారు. రష్యన్ విప్లవం జరిగి సామ్రాజ్యవాదులు జోక్యం చేసుకుంటున్న ఆ రోజుల్లో వారు కాబూల్‌కు వెళ్లారు. వారు విప్లవకారులతో చేరారు. తత్ఫలితంగా అక్టోబర్ విప్లవ స్ఫూర్తినొంది మాస్కోలో యూనివర్సిటీ ఆఫ్ టాయిలర్స్‌లో చేరి కమ్యూనిస్టు లక్ష్యాలకు తమ జీవితాలను అంకితం చేశారు. వారిలో ఎక్కువ మంది పంజాబ్‌కు, కొందరు వాయువ్య ప్రాంతానికి, భోపాల్‌కు చెందినవారు. అక్బర్‌ఖాన్, అబ్దుల్ మరీద్, రఫిక్ అహ్మద్ వారిలో ప్రముఖులు.

జాతీయోద్యమంలోనూ, దేశ కమ్యూనిస్టు ఉద్యమంలోనూ నాయకులుగా పనిచేస్తూ ఆనాటి అన్ని రకాల కష్ట నష్టాలను వారు అనుభవించారు. మీరట్ కుట్ర కేసులో అబ్దుల్ మరీద్ సహ నిందితుడు. దేశ విభజన అనంతరం ఫిరో బుద్దీన్ పాకిస్తాన్ కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి అయ్యారు.



ఈ కామ్రేడ్స్ జాతీయ స్వాతంత్ర్యం కోసం, దేశంలో కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాణం కోసం చేసిన అశేష త్యాగాలను వివరించడం ఈ వ్యాసంలో సాధ్యమయ్యేది కాదు. నాటి కాలంలోని భారతీయ పత్రికలు సోవియట్ విప్లవాన్ని హర్షించాయి. వివిధ పత్రికల్లో వచ్చిన వ్యాఖ్యలు చూస్తే సోవియట్ విప్లవ ప్రభావం ఎంతగా పని చేసిందో విదితవుతుంది. పంజాబ్, బెంగాల్, మహారాష్ట్ర, యూపీలకు చెందిన అనేక పత్రికలు అక్టోబర్ విప్లవాన్ని హర్షిస్తూ సానుకూల వ్యాఖ్యలు చేశాయి. ప్రఖ్యాత తమిళ కవి సుబ్రహ్మణ్య భారతి ఈ విప్లవంతో ఎంతో స్ఫూర్తి పొందారు. రష్యాలో ప్రైవేటు ఆస్తి ప్రజల ఆస్తిగా మారిందని 1917 నవంబర్ 28న ఆయన రాశారు. భారతదేశంలో మొట్ట మొదటి సారిగా లెనిన్ పేరును ప్రస్తావించింది బహుశా ఆయనేననుకుంటా. మన పార్టీ వ్యవస్థాపకుల్లో ఒకరైన ముజఫర్ అహ్మద్ కూడా అక్టోబర్ విప్లవ ప్రాశస్త్యం గురించి రాస్తుండేవారు. ఎస్.ఎ డాంగే 'సోషలిస్టు' అనే పత్రిక వెలువరిం చారు. అనేక ఇతర పత్రికలు కూడా అక్టోబర్ విప్లవ నినాదాలను ఎలుగెత్తి చాటనారం భించాయి. 20వ దశకం మధ్య భాగంలోనూ, చివరిలోనూ భారత దేశంలోని ప్రముఖ విప్లవ కారులందరూ అక్టోబర్ విప్లవంతో ప్రభావితులై, దోపిడీ రహిత సమాజంలోనే నిజమైన స్వాతంత్ర్యాన్ని అనుభవించగలు గుతామని భావించి, అటువంటి స్వాతంత్ర్య సాధనే తమ లక్ష్యంగా ఎంచుకున్నారు. 1920న దశాబ్దం చివరిలోనూ, 1930 దశాబ్ది ఆరంభంలోనూ పెక్కు మంది విప్లవకారులు, అమశీలన, జుగంతర్, హిందుస్తానీ సోషలిస్టు రిపబ్లికన్ ఆర్మీ వంటి వాటికి చెందినవారైనా లేక ఇతర సంఘాలకు చెందినవారైనా అక్టోబర్ విప్లవ నినాదాలకు ఆకర్షితులై నూతన సమాజ స్థాపన లక్ష్యానికి తమ జీవితాలను అంకితం చేశారు. జబ్బర్ అకాలీలలో పెక్కుమంది కారాగారవాసం నుంచి బయటకు వచ్చిన అనంతరం కమ్యూనిస్టు పార్టీలో చేరారు.

### కార్మికవర్గంపై ప్రగాఢ ప్రభావం

రాజకీయ కార్యాచరణకు పూనుకొనేలా భారత కార్మిక వర్గంపై కూడా విప్లవం పెద్ద ఎత్తున ప్రభావాన్ని చూపింది. బాల గంగాధర తిలక్‌ను నిర్బంధించటాన్ని వ్యతిరేకిస్తూ తొలుత బొంబాయిలోని జౌళి కార్మికులు విజయవంతంగా సార్వత్రిక సమ్మెను నిర్వహించారు. దీనిని లెనిన్ గమనంలోకి తీసుకొని భారత రాజకీయాల్లో అత్యంత విప్లవాత్మకమైన వర్గం తలెత్తిందని పేర్కొన్నారు. 1935లో సోషలిస్టు రాజ్యాంగాన్ని ప్రకటించగానే అనేక రైతు సంఘాలనూ స్థాపించారు. శాసనోల్లంఘనతో భ్రమలు తొలగడంతో మేధావి వర్గానికి చెందిన అనేకులు మన దేశంలో సోషలిజం వైపునకు ఆకర్షితులయ్యారు. ప్రతి ఒక్కరూ సోషలిజం గురించి మాట్లాడటం మొదలు పెట్టారు. సామ్రాజ్యవాదుల పాలనకు, మన దేశంలోని వారి తైనాతీలకు వ్యతిరేకంగా పోరాటాన్ని సాగించే వారందరికీ అరుణ పతాకం అత్యంత ఆకర్షణీయంగా మారింది.

రెండో దశకం చివరి ప్రాంతంలో భగత్‌సింగ్ సైతం అక్టోబర్ విప్లవం వైపునకు ఆకర్షితుడయ్యాడు! ఆ సమయంలో నిర్బంధంలో ఉన్న ఆయన మార్క్సిజం లెనినిజం పట్ల పూర్తి విశ్వాసాన్ని కలిగివు న్నాడు. ఈ మహత్తర విప్లవకారుణ్ణీ ఆయన సహచరులను అక్టోబరు విప్లవం ఏ విధంగా ఆకర్షించినదీ ఆయన తుది ప్రకటన తెలియ చేస్తున్నది. ఆయన సహచరుల్లో ఎక్కువభాగం జీవితఖైదును ముగించుకొన్న పిమ్మట శేష జీవితాన్ని అణగారిన ప్రజల కోసమూ, కార్మికుల కోసమూ, లక్షలాది పీడితుల కోసమూ అంకితం చేశారు. ఇప్పటికీ సజీవంగానే ఉన్న కామ్రేడ్ శివవర్మ, మార్క్సిజం లెనినిజం సిద్ధాంతాన్ని ప్రచారం చేసేటందుకై ఈనాటికీ అసంఖ్యాకమైన వ్యాసాలు రాస్తూనే ఉన్నారు. అక్టోబరు విప్లవంతో ప్రభావితులై జాతీయ స్వాతంత్ర్యం కోసమూ, మనదేశంలోని కార్మికవర్గ ప్రయోజనాల కోసమూ, పీడితుల కోసమూ త్యాగాలు చేయటానికి ఏ మాత్రం సందేహించని ఈ విప్లవకారులనూ, దేశభక్తులనూ ఎవరు మాత్రం మరచిపోగలరు.

### సోషలిస్టు భావాల వ్యాప్తి

జాతీయోద్యమానికి చెందిన అగ్రనాయకులు సైతం ఈ ప్రభావానికి లొంగినవారే. ఎందుకంటే తాము సాగిస్తున్న స్వాతంత్ర్య పోరాటానికి అక్టోబరు విప్లవం గట్టి మద్దతుదారు అని వారు తెలుసుకో గలిగారు. కష్టకాలంలో జాతీయ ఉద్యమా నికి సోవియట్ మద్దతు ఇవ్వని సంఘటన ఒక్కటి కూడా చరిత్రలో లేదని చెప్పవచ్చు. అక్టోబరు విప్లవ పదో వార్షికోత్సవం సందర్భంగా 1927లో మోతీలాల్ నెహ్రూ, జవహర్‌లాల్ నెహ్రూలు సోవియట్ యూనియన్‌కు వెళ్లారు. సోవియట్ వ్యవస్థను నిర్మించడంలోనూ, ప్రపంచ పరిణామాలను మార్చడంలోనూ అక్టోబరు విప్లవం నిర్వ హించిన పాత్ర గురించి వారు తమ రచనల్లో బహుధా ప్రశంసించారు. జాతీయోద్య మానికి చెందిన

మరో చిరస్మరణీయుడు నేతాజీ సుభాస్ చంద్రబోస్ కూడా సోవియట్ యూనియన్ వైపునకు గాఢంగా ఆకర్షితుల య్యారు. సోష లిజం ఎందుకు అన్న జయ ప్రకాష్ నారా యణ్ రచన అక్టోబరు విప్లవ ఆదర్శాలను వ్యాప్తి చేయడంలో ఎంతగానో ఉపయోగ పడింది. వాస్తవానికి సామ్రాజ్య వాదంపై లెనిన్ విశ్లేషణ కార్మిక వర్గానికే కాక రైతాం గానికి, మేధావి వర్గానికి చెందిన అత్యధి కులకు ఎంతో స్ఫూర్తినిచ్చింది. ఎందుకంటే బ్రిటిష్ సామ్రాజ్యవాదుల నిరంకుశ, దోపిడీ పాలనలో ఉన్న మనదేశ వాస్తవ జీవిత చిత్రణను అది ప్రతిబిం బించింది.

మనదేశంలో మూడో దశకం మధ్య భాగం నుంచి సోషలిస్టు భావాలు అత్యధి కంగా ప్రచారం కాసాగాయి. మీరట్ కుట్రకేసు ఈ విషయంలో బృహత్తర పాత్రను నిర్వహించింది. ఈ భావాలకు అది ప్రచారాన్ని కలిగించింది. వీటితో స్ఫూర్తి పొందిన కార్మిక వర్గానికీ, రైతాంగానికీ మద్దతు పలికింది. తదనంతరం సోవియట్ యూనియన్‌పై సామ్రాజ్యవాదులు విరుచు కుపడినపుడు దాని రక్షణ కోసం భారత దేశమంతా ఒక్క తాటిపై నిలిచింది. ఫాసి జంపై సాధించే విజయంతో తాము సాగించే స్వాతంత్ర్య పోరాటం ముడిపడి ఉందన్న విషయం వారికి తెలుసు. ఈ సందర్భంలో కూడా సోవియట్ యూనియన్ కీలకపాత్రను నిర్వహించింది. దాదాపు రెండు కోట్ల మంది ప్రజలను త్యాగం చేయ వలసి వచ్చింది. అనేక విధ్వంసాలకు గురైంది. వలస వాదాన్ని నిర్మూలించాలన్న లెనిన్ లక్ష్యాన్ని నెరవేర్చడానికి అది కృషి చేసింది.

రెండో ప్రపంచ యుద్ధానంతరం బ్రిటిష్ పాలకులకు వ్యతిరేకంగా నౌకా దళానికి చెందిన వారు సైతం తిరుగుబాటు చేశారు. కాంగ్రెస్, ముస్లింలీగ్ పతాకాలతో పాటు వారు ఎర్రజెండాను కూడా ఎగుర వేశారు. తత్కారణంగా మరోసారి అక్టోబరు విప్లవ ఆదర్శాల ప్రగాఢ ప్రభావం రుజు వైంది. ఆర్.ఎన్.ఐ. తిరుగుబాటు బ్రిటిష్ సామ్రాజ్యవాదంపై పడిన చిట్ట చివరి దెబ్బ. దీనితో బ్రిటిష్ వారు కాంగ్రెస్‌తో రాజీ కుదుర్చుకోవల్సిన పరిస్థితి ఏర్పడింది.

**స్వతంత్ర భారతావనికి అమూల్య సహాయం:** యుద్ధానంతర కాలంలో భారత రాజకీయ నాయకులు తొలుత ఊగిసలాటను ప్రదర్శించినప్పటికీ తొందరలోనే సామ్రాజ్య వాదం అనుకున్నంత బలోపేతమైందికాదని, అదేవిధంగా స్వతంత్ర ఆర్థిక వ్యవస్థ నిర్మాణానికి అది దోహదం చేయదని గుర్తిం చారు. సోవియట్ యూనియన్ అక్టోబరు విప్లవమూ మరోసారి మనకు సహాయం చేశాయి. పారిశ్రామిక పునాదిని వేసుకో గలిగిన శక్తి భారత్‌కు సమకూరితే అది దాని ప్రధాన పాత్రకు మరింత ప్రాధాన్యతను చేకూరుస్తుంది. వివిధ మార్గాల ద్వారా మనపై ఒత్తిడి తేవడానికి సామ్రాజ్యవాదం ప్రయత్నించింది. అయితే సోవియట్ యూని యన్ గట్టి మద్దతు ఉండ టంతో ఈ ఒత్తిళ్లను అధిగమించగలిగాం. భారత్ సోవియట్ సంబంధాల్లోనూ, భారత్‌పై ఒత్తిడి తేవటానికి సామ్రాజ్యవాదులు చేపట్టిన చర్యలను తిప్పి కొట్టడంలోను భారత్‌- సోవియట్ సంధి ప్రముఖ పాత్ర వహించింది. సంకుచిత వర్గ ప్రయోజనాలు ఆశించేవారు మాత్రమే ప్రస్తుత పరిణామాల పట్ల హర్షాన్ని వ్యక్తం చేస్తున్నారు. ఐ.ఎం.ఎఫ్, ప్రపంచ బ్యాంకు షరతులతో ప్రమాదకరమైన పరిస్థితిని ఎదుర్కోనబోతు న్నామని తెలుస్తోంది. మారుతున్న ప్రపంచ పరిస్థితుల్లో మనదేశ ఆర్థిక సార్వభౌమత్వాన్ని కుదించి వేసేందుకు మనపై తన ఆదేశాలను రుద్దాలని అమెరికా భావిస్తోంది. ప్రపంచంలో శాంతి, ప్రజాస్వామ్యాల కోసం జరిగే పోరా టంలో భారత్ కూడా తన వంతు పాత్రను నిర్వహించేలా ఇది అంతిమంగా దారి తీస్తుంది.

**పోరాటం కొనసాగుతోంది**

సోషలిస్టు విప్లవాలను తీసుకు రావటంలో జయప్రదమైన గత వలస దేశాల నయా వలస దేశాల ప్రజలను కూడా అక్టోబరు విప్లవం ఉత్తేజితులను చేసింది. చైనా, వియత్నాం, కొరియా, క్యూబా వంటి వెనుకబడిన దేశాల్లో వచ్చిన విప్లవాలు అత్యంత ప్రాధాన్యమున్నవి. మార్క్సిజం, లెనినిజాన్ని పరిరక్షించటానికే వారు నిశ్చయించుకొన్నారు. అక్టోబరు విప్లవ పతాకాన్ని దించబోమని వారు బహిరం గంగానే ప్రకటించారు. సోవియట్ యూని యన్‌లో సైతం పెట్టుబడిదారీ విధానం తమకు ప్రత్యామ్నాయాన్ని చూపలేదని ప్రజలు త్వరలోనే తెలుసుకోగలరు. సోషలిస్టు వ్యవస్థలో తామనుభవించిన సౌకర్యాలు (పనిహక్కు, నివాస హక్కు, వైద్య సదుపాయం, విద్య తదితర హక్కులు, భద్రతలు) పెట్టుబడి దారీ వ్యవస్థలో వారికి అందుబాటులో ఉండవు. కనుక వారి ముందున్న ఒకే ఒక మార్గం తాత్కాలిక ఇబ్బందులు, పొరపాట్లను అధిగమించి అక్టోబరు విప్లవాన్ని పరిరక్షిం చడం తప్ప దాన్ని అగౌరవపరచడం కాదు.

భారతదేశానికి సంబంధించి.. అక్టోబరు విప్లవం విఫలమైందని భావించే వారికి చరిత్ర గురించి గానీ, మనదేశ సామాజిక, ఆర్థిక పరిస్థితుల గురించిగానీ అవగాహనలేదని చెప్పొచ్చు. బాధాకరమైన దారిద్ర్యమూ, నిరుద్యోగమూ, కొనసాగుతున్న సాంఘిక అణచివేత, అర్ధ ఫ్యూడల్ విధానాలకు స్వస్తి చెప్పడంలో బూర్జువావర్గం వైఫల్యాలను, గుత్తపెట్టుబడిదారులకు పెరుగు తున్న లాభార్జన వల్ల వర్గ పోరాటం తీవ్రత రమై ప్రజలు మరింత ముందుకు సాగుతారు. 1947కు ముందు సామ్రాజ్య వాదుల పాలన గురించి భారత్‌కు అపారమైన అనుభవం ఉంది. దేశ స్వాతంత్ర్యం మరింత పటిష్టం కావడానికి సేవలందించగలమని హామీలిచ్చి ప్రజానీ కాన్ని సామ్రాజ్యవాదులు తప్పుదోవ పట్టించారు. సామ్రాజ్యవాదుల సకల చర్యలు మన స్వాతంత్ర్యాన్ని హరించ టానికి మాత్రమే దోహదపడతాయి కానీ దాన్ని బలపర చడానికి కాదు. కనుకనే అక్టోబరు విప్లవం నుండి ఉత్తేజాన్ని పొందిన మన స్వాతం త్ర్యోద్యమ స్ఫూర్తి సామ్రాజ్య వాదుల కుతంత్రాలకు తలవంచదు. అక్టోబరు విప్లవ ఆశయాలకు మద్దతుగా కార్మిక వర్గమూ, పీడిత ప్రజలు, అణగారిన జనమూ గట్టిగా నిలబడతారని, సామాజిక విముక్తికై ముందుకు సాగుతారని విశ్వసిస్తున్నాం.

# కార్మికవర్గం - మహత్తర అక్టోబర్ విప్లవం

- కె. హేమలత,
సిఐటియు అధ్యక్షురాలు

సంవత్సరకాలంగా ప్రపంచ వ్యాప్తంగా కార్మికవర్గం మహత్తర అక్టోబర్ విప్లవ శత వార్షికోత్సవాలు జరుపుకుం టోంది. సిఐటియు 15వ అఖిల భారత మహాసభ అక్టోబర్ విప్లవ శతవార్షికోత్స వాలను కార్యకర్తల్లో సైద్ధాంతిక అభివృద్ధికి



ఉపయోగించాలని నిర్ణయించింది. ఆ నిర్ణయానికనుగుణంగా దేశవ్యాప్తంగా సిఐటియు అనుబంధ సంఘాలు, రాష్ట్ర కమిటీలు అనేక తరగతులు, సదస్సులు, సమావేశాలు, సెమినార్ల వంటివి నిర్వహిస్తున్నాయి. వీటికి తోడుగా ఈ సందర్భాన్ని గుర్తుచేసుకుంటూ బీమా, బ్యాంకు, టెలికాం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వం వంటి రంగాల్లోని సంఘాలు అనేక కార్యక్రమాలు చేశాయి. వామపక్ష పార్టీలు దేశవ్యాప్తంగా శతవార్షికోత్సవాలు నిర్వహిస్తున్నాయి.

ప్రపంచ కార్మిక సంఘాల సమాఖ్య (డబ్ల్యుఎఫ్‌టీయూ) అన్ని ఖండాల్లోని 126 దేశాల్లో 92 మిలియన్ కార్మికులకు ప్రాతినిధ్యం వహిస్తూ ప్రపంచ వ్యాప్తంగా అనేక కార్యక్రమాలు చేపట్టడం ద్వారా శతవార్షికోత్సవాలు నిర్వహించింది. డబ్ల్యుఎఫ్‌టీయూ నాయకత్వం మాస్కోలో రష్యన్ ఫెడరేషన్ కమ్యూనిస్టు పార్టీ నిర్వహిస్తున్న ముగింపు కార్యక్రమాల్లో పాల్గొననుంది. మహత్తర అక్టోబర్ విప్లవం వంద సంవత్సరాల క్రితం రష్యాలో జరిగిన ఘటన. పారిశ్రామికంగా వెనకబడిన రష్యా దేశంలో సోషలిజం స్థాపనకు దారితీసిన ఘటన అది. రష్యాలోనూ, తూర్పు యూరప్ దేశాల్లోనూ సోషలిజం దెబ్బతిన్న తర్వాత కూడా ప్రపంచ కార్మికవర్గానికి స్ఫూర్తినిచ్చేంత ప్రాముఖ్యత ఈ విప్లవానికి ఎందుకు వచ్చింది?

"ప్రపంచాన్ని కుదిపేసిన ఆ పది రోజులు" అనే పుస్తకంలో ఆ ఘటనలకు ప్రత్యక్ష సాక్షి అమెరికన్ సోషలిస్టు, జర్నలిస్టు జాన్‌రీడ్ పేర్కొన్నట్లు అక్టోబర్ విప్లవం వాస్తవంగానే ప్రపంచాన్ని కుదిపేసిన ఘటన. సామ్రాజ్యవాద అంతాన్ని ప్రస్ఫు టించిన ఘటన. కార్మికులు, రైతాంగం, ఇతర కష్టజీవులు పెట్టుబడిదారీ దోపిడీ వ్యవస్థను కూల్చివేసి దోపిడీ రహిత సమాజానికి, సోషలిస్టు సమాజంగా నిలబెట్టడానికి బాట వేశారు. మానవాభివృద్ధికి భవిష్యత్‌బాటను ఇది చూపించింది. నిర్దిష్ట పరిస్థితులకు అనుగుణంగా నిర్దిష్ట విశ్లేషణకు మంచి ఉదాహరణగాను, కార్మికవర్గ పార్టీ బోల్షిక్‌పార్టీ సమాజమార్పునకు మార్క్సిస్టు సూత్రాలను నైపుణ్యంగా అన్వయించడానికి మంచి ఉదాహరణగా దీనిని పేర్కొనవచ్చు.

ఆ విప్లవం సాధించినవి అప్పటి వరకు ఎక్కడా జరగలేదు. ఎవరూ ఊహించినవి కూడా కాదు. అది ఒక అద్భుతం. రెండో ప్రపంచ యుద్ధం తర్వాత యూరప్‌లో "సంక్షేమరాజ్యాలు"గా పిలువబడేవి కూడా కార్మికవర్గం సాధించుకున్న హక్కులు, ప్రయోజనాలైన భూపంపిణీ, పరిశ్రమలపై కార్మికుల నియంత్రణ, ఎన్నుకున్న ప్రజా ప్రతినిధులను రీకాల్ చేసే హక్కు, ఉచిత విద్య, అందరికీ ఆరోగ్యం, ఉచిత నర్సరీలు (కమ్యూనిటీ వంటశాలలు, లాండ్రీలు) ఇంటి పనుల నుండి మహిళలకు స్వేచ్ఛ కల్పిస్తూ కమ్యూ నిటీ వంటశాలలు వంటివి ఇవ్వలేక పోయాయి. విప్లవకారులు సాధించిన అద్భుత మార్పులు చెక్ కమ్యూనిస్టు ఫుచ్స్ చెప్పినట్లు "మా రేపటి ఉదయాలన్నీ నేడే వచ్చాయన్నట్లు" ఉన్నాయి.

ప్రపంచవ్యాప్తంగా ఆయా దేశాల స్వాతంత్రోద్యమాలపైన అక్టోబర్ విప్లవ ప్రభావం, రెండో ప్రపంచ యుద్ధంలో జర్మనీనాజీలను ఓడించడంలో సోవియట్ పాత్ర, హిట్లర్ ఫాసిజం కోరల నుండి ప్రపంచాన్ని కాపాడటంలో ప్రజలు చేసిన అసమాన త్యాగాలు అందరికీ తెలిసినవే. మనదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత స్వశక్తిపై మనం ఎదగడానికి పలు ప్రభుత్వరంగ సంస్థలను నెలకొల్పి పారిశ్రా మికంగా, సాంకేతికపరంగా దేశం అభివృద్ధి చెందడానికి, ఇంజినీరింగ్ విద్యకు అవస రమైన ముఖ్యమైన సంస్థలు నెలకొల్పడానికి సోవియట్ యూనియన్ బేషరతుగా సహాయ, సహకారాలు అందించింది. ప్రపంచాన్ని మార్చిన విప్లవానికి నాయత్వం వహించిన రష్యన్ కార్మికవర్గం అనుభవాల నుండి భారత కార్మికవర్గం నేర్చుకోవాల్సిన పాఠాలు ఏమిటి?

నేడు భారత కార్మిక వర్గానికి ఉన్న పరిస్థితుల కంటే రష్యన్ విప్లవానికి ముందు రష్యాలోని కార్మికవర్గం, వాటి కార్మిక సంఘాల పరిస్థితులు అంత మెరుగైనవి కావు. అవి చాలా దుర్భరంగా ఉండేవి. దేశంలో పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి అవ్వడంతోనే రష్యాలో కార్మిక ఉద్యమాలు ప్రారంభమైనా, మొదటి సమ్మె 1870-80 మధ్య కాలంలో జరిగింది. 1905 వరకు సంఘాలు ఏర్పడలేదు. తర్వాత కాలంలో

కార్మిక సంఘాలు, వాటి ప్రభావం విస్తరించాయి.

కానీ 1907 నుండీ యూనియన్లపైన అణచివేత, పోలీసుల విచారణలు పెరిగాయి. వారి నిధులను, రిజిస్టర్లను పోలీసులు జప్తు చేశారు. నాయకులను, యూనియన్ అధ్యక్ష, కార్యదర్శులతో సహా సైబీరియా ప్రాంతానికి పంపారు. కార్మికులను వారి ఆర్థిక కోర్కెలపై కూడా యూనియన్లు రోజువారీ కార్యక్రమాలు, ఉద్యమాలు నిర్వహించడం అసాధ్యమయ్యేట్లుగా జార్ చక్రవర్తి నిరంకుశ పాలన చేసింది. 1914లో మొదటి ప్రపంచ యుద్ధ ప్రకటనతో పరిస్థితులు మరింత దుర్భరమయ్యాయి. కార్మిక సంఘాల అణచివేతకు యుద్ధాన్ని పాలకవర్గాలు అడ్డుపెట్టుకున్నాయి. 1905లో కార్మిక సంఘాల్లో సుమారు 2 లక్షల మంది కార్మికులుంటే 1917 విప్లవం నాటికి కేవలం మూడు సంఘాలు మొత్తం 15 వందల మంది సభ్యత్వంతో మిగిలాయంటే అణచివేత ఏ స్థాయిలో ఉందో అర్థం చేసుకోవచ్చు.

కార్మికసంఘాలు ఇంతటి విపత్కర పరిస్థితుల్లో ఉన్నా కార్మికవర్గం, ఇతర కష్ట జీవులు వారి ఆర్థిక పోరాటాలను అత్యంత పట్టుదలగా నిర్వహించారు. జార్ నిరంకుశ అణచివేత కాలంలో కూడా సాగిన ఇలాంటి పోరాటాలు కూడా కార్మికవర్గ చైతన్యాన్ని పెంచాయి.

యుద్ధం దేశాన్ని సర్వనాశనం చేసింది. కార్మికుల పరిస్థితులు మరింత దిగజారాయి. ఆహారం దొరకడం లేదు. సరైన దుస్తులు, సరంజామా లేకుండా గడ్డకట్టే చలిలో సైనికులు యుద్ధానికి వెళ్లాల్సి వచ్చేది. ఈ తరగతులన్నింటిలోనూ అసంతృప్తి పెరిగింది.

ఇటువంటి పరిస్థితుల్లో 1917 ఫిబ్రవరి 23 (కొత్త కాలెండర్ ప్రకారం మార్చి 8) న పనిబంద్ చేసి పెట్రోగ్రాడ్‌లోని మహిళా కార్మికులు మొదటి సారిగా 'అంతర్జాతీయ మహిళాదినం' పాటించారు. టెక్స్‌టైల్ ఫ్యాక్టరీలోని మహిళా కార్మికులు రోడ్లపైకొచ్చి ప్రదర్శన చేస్తూ ఇతర ఫ్యాక్టరీల్లోని కార్మికులను తమతో వచ్చి ప్రదర్శనలో పాల్గొనాలని నినదించారు. వందల, వేల సంఖ్యలో కార్మికులు, స్త్రీ, పురుషులు ప్రదర్శనలో పాల్గొని ఆహారం కోసం, యుద్ధ నివారణ కోసం డిమాండ్ చేశారు. నిరంకుశత్వం అంతం కావాలని నినదించారు. వందలాది నాయకులను మిలిటరీ అరెస్టు చేసింది. ఆరోజు దాదాపు వంద మందిని చంపేశారు. ప్రజలపై జరిగిన ఈ అమానుష కాండకు కలత చెందిన సైన్యంలోని పెద్ద భాగం విప్లవ కారులతో చేతులు కలిపింది. ఈ ఫిబ్రవరి విప్లవం జార్ నికోలాస్-2ను బలవంతంగా పదవీచ్యుతుడ్ని చేసింది.

జార్ నిరంకుశత్వం త్రోసి వేయటంతో కార్మికులు, కష్టజీవుల్లో సృజనాత్మక, నిర్మాణాత్మక ఆలోచనలు వెల్లివిరిశాయి. కార్మికుల మొదటి కౌన్సిల్ (సోవియట్) 1905లో టెక్స్‌టైల్ కార్మికుల సమ్మె సందర్భంగా సమ్మె కమిటీగా ఏర్పడింది. దీని తర్వాత దాదాపు 50 పట్టణాల్లో వర్కర్స్‌తో కూడిన సోవియట్స్ (కౌన్సిల్స్) ఏర్పడినా, వాటిని అణిచివేశారు. ఆ నాయకులను అరెస్టు చేసి జైల్లో ఉంచారు. ఫిబ్రవరి విప్లవం తర్వాత వర్కర్స్‌తో కూడిన సోవియట్స్, సైనికులతో కూడిన సోవియట్స్, రైతాంగ కుటుంబాల నుండి, రైతుల నుండి వచ్చిన వారితో సోవియట్స్ ఏర్పడి చురుకుగా పని చేయడం మొదలైంది. 1917 జూన్‌లో జరిగిన మొదటి సోవియట్స్ కాంగ్రెస్‌లో 400పైగా సోవియట్స్‌కు ప్రాతినిధ్యం వహిస్తూ 1090 మంది ప్రతినిధులు హాజరయ్యారు. అక్టోబర్ విప్లవం నాటికి 900 పైగా సోవియట్‌లు ఉన్నాయి. పెట్రోగ్రాడ్, మాస్కోలతో సహా వీటిలో ఎక్కువ శాతం బోల్షివిక్‌ల ఆధీనంలో ఉండేవి. కార్మికులతో కూడిన సోవియట్స్ రష్యా కార్మికవర్గానికి రాజకీయ పోరాటంలో సాధనాలుగా ఉండేవి.

ప్రారంభంలో బోల్షివిక్కులకు సోవియట్స్‌లో మెజార్టీ లేదు. 1917 జూలై వరకు వారు మైనార్టీలో ఉన్నారు. కానీ, లెనిన్ నాయకత్వంలో అవలంబించిన ఎత్తుగడలు అక్టోబర్ కల్లా వారికి మెజార్టీ సోవియట్స్ దక్కేట్లు చేశాయి. ప్రొవిన్షియల్ ప్రభుత్వంపై భ్రమలను తుడిచివేస్తూ, ఓపిగ్గా నికరమైన వివరణ ఇస్తూ ప్రభుత్వ లోపాలను ఎత్తి చూపి, మెజార్టీ సోవియట్‌లను దక్కించుకోవాల్సిన అవసరాన్ని లెనిన్ తెలియచేశారు. రాజ్యాధికారం మొత్తం సోవియట్‌లకు బదిలీ అవ్వాల్సిన అవసరం గురించి వారికి తెలియ చెయ్యటానికి అవసరమైన పద్ధతి కావాలని ఆయన నొక్కి చెప్పారు. బోల్షివిక్‌ల ముందున్న ముఖ్యకర్తవ్యం ఇదేనన్నారు. నిర్మాణంపైన కూడా ఆయన అనేక వివరాలు ఇచ్చారు. కార్మికులు, పేద రైతాంగం అధికారం చేపట్టి, దాన్ని సద్వినియోగం చెయ్యటానికి సంఘటితం కావాలని లెనిన్ పిలుపు నిచ్చారు. "నిర్మాణం, నిర్మాణానికి మించిన ఆయుధం లేదు. మాటలతో కాలంగడపకండి. పాలకుల వాగ్దానాలకు మోసపోకండి, మీ బలాన్ని అతిగా అంచనా వెయ్యకండి, ప్రతి ఫ్యాక్టరీలో కార్మికుల్ని సమీకరించండి, ప్రతి రెజిమెంట్‌లో, ప్రతి కంపెనీలో, ప్రతి నివాస ప్రాంతంలో సమీకరించండి. మీ సంఘంలో ప్రతి రోజు, ప్రతి గంట ఆ పనిని మీరే చెయ్యండి. ఇది ఇంకొకరికెవరికో అప్పచెప్పేది కాదు. క్రమంగా పనిచేసి, చెక్కుచెదరని అచంచల విశ్వాసాన్ని అభివృద్ధి చెందిన కార్మికుల్లో, ప్రజా సమూహాల్లో నింపండి. అదే విజయాన్నిదక్కేట్లు చేస్తుంది."

కార్మికవర్గం రైతాంగంతో జతకట్టాల్సిన అవసరం గురించి లెనిన్ తెలియజేసేవారు. ఆల్ రష్యన్ ట్రేడ్‌యూనియన్స్ మహాసభలో మాట్లాడుతూ కార్మికులు వ్యవసాయ కార్మికులను సమీకరించటంలో చొరవ చెయ్యాలని, వారిలో మెజార్టీ కార్మికపక్షం వచ్చేలా చూడాలని విజ్ఞప్తి చేశారు. "రాజ్యంపై ఆధారపడకుండా కార్మికోద్యమం తన స్వంత బలంపై ఆధారపడాలనేదే కార్మికోద్యమానికి మొదటి నియమం. విప్లవకరమైన అణగారిన వర్గం చేతికి అధికారం బదలాయింపే ప్రస్తుత సంక్షోభ నివారణకు పరిష్కారం. అదే యుద్ధానికి కూడా పరిష్కారం" అని ఆయన చెప్పారు.

కార్మికవర్గంపై దాడిచేయడం ద్వారా తమ లాభాలను పరిరక్షించుకోవాలని పెట్టుబడిదారీ వర్గం ప్రయత్నిస్తున్న నేటి దశలో, వంద సంవత్సరాల క్రితం లెనిన్ చెప్పిన పైవిషయాలను మనం గమనంలో ఉంచుకోవాలి.

నేడు మనదేశ కార్మికవర్గంలోని మెజార్టీ పాలక వర్గాల సిద్ధాంత ప్రభావంలో ఉన్నారు. నయా ఉదారవాద విధానంతో పాలకవర్గం అన్ని తరగతుల కష్టజీవులు- కార్మికులు, వ్యవసాయ కార్మికులు, రైతాంగం, చేతి వృత్తుల వంటి వారి జీవితాలపై, జీవనాధారాలపై, పని పరిస్థితులపై, కనీస హక్కులపై దాడి చేస్తోంది. కొద్దిమంది ప్రైవేటు కార్పొరేషన్ల చేతుల్లోకి ప్రజాసంపదను అప్పజెప్పటానికి ఈ విధానాలు ఉద్దేశించబడ్డాయి. ఒక పక్కన ఇలా చేస్తూనే తమ మోసపూరిత వాగ్దానాలు, నినాదాలతో ప్రజల్లో భ్రమలను సృష్టిస్తున్నారు. ప్రజలు నెమ్మదిగా ఈ భ్రమల నుండి బయట పడుతున్నారు. కార్మికవర్గం ఐక్యంగా చేస్తున్న ఉద్యమాలను బలహీనపరిచి, చెల్లాచెదురు చెయ్యటానికి మత ఉద్రిక్తతలు, కులభావాలు, ప్రాంతీయ సెంటిమెంట్లను రెచ్చగొడు తున్నారు.

కార్మికవర్గాన్ని, కష్టజీవులను పాలక వర్గాల ప్రభావం నుండి బయటకు తీసుకు రావటానికి లెనిన్ నేర్పినట్లు 'ఓపిగ్గా. క్రమ పద్ధతిగా, నిబద్ధతతో వివరణ, బోధన' చెయ్యాల్సి ఉంది. 'ప్రపంచాన్ని కుదిపేసిన ఆ పది రోజుల' విప్లవ కాలంలో వేలాది సంఘాలు, వందల వేల కరపత్రాలు సైన్యం, గ్రామాలు, ఫ్యాక్టరీలు, వీధుల్లో పంపిణీ చేశారు. వేడి ఇసుక నీరును పీల్చుకున్నట్లుగా ప్రజలు వాటిని స్వీకరించారు. అవి కట్టు కథలు, తప్పుడు చరిత్రలు, నిరుత్సాహపర్చే మత బోధనలు, అవినీతి చేసే జిమ్మిక్కులు కాదు. అవి సామాజిక, ఆర్థిక సిద్ధాంతాలు. తత్వశాస్త్రాలు, గోగోయి, టాల్‌స్టాయ్, గోర్కీలు రచించిన సామాజిక, ఆర్థిక, తత్వశాస్త్రాలు. నేడు కార్మికవర్గంలోను, కష్టజీవుల్లోను అటువంటి ఒక కోర్కెను రేకెత్తించాల్సి ఉంది. కార్మికులను మోసపుచ్చే విధంగా పాలక వర్గ నినాదాలు ఆకర్షణీయంగా, తియ్యగా ఉంటాయి. ఆ మోసాన్ని బహిర్గత పర్చి వారి రోజువారీ సమస్యలకు - ప్రభుత్వ విధానాలకు మధ్య ఉన్న సంబంధాన్ని తెలియజెప్పాలి. వారికి సులభంగా వారికర్థమయ్యే భాషలో వారి స్వంత అనుభవాల నుండి ఆ విధానాల వెనుక ఉన్న రాజకీయాల నిజ స్వరూపాన్ని అర్థమయ్యేట్లు చెప్పాలి.

కార్మికవర్గంలో వర్గ చైతన్యాన్ని అభివృద్ధి చేయాలి. అమానవీయమైన పెట్టుబడిదారీ దోపిడీని అంతం చేసి దాని స్థానంలో దోపిడీ లేని సోషలిస్టు వ్యవస్థను స్థాపించడంలో తమకు గల చారిత్రక పాత్రను కార్మికవర్గం గుర్తించేట్లు చేయాలి. అందుకు వారిని సంసిద్ధం చేయాలి.

పెట్టుబడిదారీ వ్యవస్థ అంతానికి ఇదే మార్గమని అక్టోబర్ మహావిప్లవం మనకు బోధించింది.

# కార్మికవర్గం - చారిత్రక పాత్ర

- బి.వి.రాఘవులు

ఆధునిక ప్రపంచాన్ని, ప్రజా జీవితాన్ని శాశ్వతంగా, తిరుగులేని విధంగా ప్రభావితంజేసిన మూడు సందర్భాలను ప్రపంచం నేడు మననం చేసుకుంటున్నది. మొదటిది: మార్క్స్ జననం, ఆయన 1818లో పుట్టాడు. వచ్చే సంవత్సరం ద్విశతాబ్ది వార్షికోత్సవాన్ని జరుపుకోవడానికి మార్క్సిస్టులు సమాయుతమవుతున్నారు. ఇంకోవైపున మార్క్సిస్టు సిద్ధాంత వ్యతిరేకులు కూడా ఈ సందర్భాన్ని పురస్కరించుకుని మార్క్సిజాన్ని మరోసారి పూర్వపక్షం చేశామని ప్రకటించడానికి శాయశక్తులా కృషిజేస్తూ పరోక్షంగా ద్విశాబ్ది జయంతి కార్యక్రమంలో పాలుపంచుకుంటారు. రెండోది: మార్క్స్ బృహత్ రచన 'పెట్టుబడి' మొదటి సంపుటం 1867 ప్రథమ ముద్రణ. ఈ ముద్రణ యొక్క 150వ వార్షికోత్సవం. ఇప్పుడు ప్రపంచవ్యాపితంగా నిర్వహించబడుతున్నది. మార్క్స్ జీవితంలోని ప్రధాన భాగాన్ని ధారపోసి కూలంకషంగా, లోతుగా అధ్యయనం జేసి పెట్టుబడిదారీ విధానగమన సూత్రాలను బట్టబయలుజేసిన గ్రంథం "పెట్టుబడి". ఈ గ్రంథం మూడు సంపుటాలుగా ముద్రణ అయింది. మార్క్స్ తన జీవిత కాలంలో సిద్ధంచేసి మొదటి సంపుటాన్ని మాత్రమే ప్రచురించగల్గారు. మిగిలిన రెండు సంపుటాలను ఆయన ఆత్మీయ మిత్రుడు ఎంగెల్స్ సంపాదకత్వం వహించి ప్రచురించాడు. మూడవది : 1917 అక్టోబర్ మహావిప్లవం. ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థ కోటను బద్దలుకొట్టి మొదటి సోషలిస్టు రాజ్యాన్ని రష్యాలో స్థాపించిన కార్మికవర్గ విప్లవ శత వార్షికోత్సవం.

గతించిన సందర్భాలను ఒక క్రతువులాగా జ్ఞాపకం చేసుకోవడం ప్రజాజీవితంలో నిరంతరం జరుగుతుండేదే. కానీ నేడు ప్రపంచం ఈ మూడు సందర్భాలను జ్ఞాపకం చేసుకోవడం గతానికి జోహార్లు అర్పించడానికే కాదు, భవిష్యత్తు మార్గ నిర్దేశం చేసుకోవడానికి కూడా. 90వ దశకంలో ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థ సరళీకరణ విధాన దశలోకి ప్రవేశించింది. 1991లో సోవియట్ యూనియన్ విచ్ఛిన్నమయింది. రష్యా, తూర్పు యూరప్‌లోని సోషలిస్టు వ్యవస్థలు కుప్పకూలిపోయాయి. మార్క్సిజానికి, సోషలిజానికి కాలం చెల్లిందని, పెట్టుబడిదారీ విధానం శాశ్వతమని జరిగే ప్రచారాలు సత్యమని నమ్మే పరిస్థితి ఏర్పడింది.

ఈ పరిస్థితి ఎక్కువ కాలం నిలవలేదు. 2008లో అమెరికాలో ప్రారంభమయి ప్రపంచాన్ని కుదిపేసిన సబ్‌ప్రైమ్ సంక్షోభం పెట్టుబడిదారీ విధానం భవిష్యత్‌పై అనుమానాలను రగిల్చింది. మార్క్సిజం రుజుత్వాన్ని, సోషలిజం ప్రత్యామ్నాయాన్ని, వర్గపోరాట వాస్తవాన్ని మళ్ళీ ప్రజాజీవితంలోకి, రాజకీయ



చర్చల్లోకి తెచ్చింది. ఇటువంటి నేపథ్యంలో మార్క్స్ జయంతి ద్విశతాబ్ది, పెట్టుబడి మొదటి సంపుటం 150వ వార్షికోత్సవం, అక్టోబరు విప్లవ శతవార్షికోత్సవం రావడం సహజంగానే మననానికే కాక మేథోమథనానికి దారి తీసింది. మూడు సందర్భాలు, కార్మికవర్గానికి సంబంధించి మన ముందుంచే మూడు ముఖ్యమైన అంశాలను క్రింద చర్చిస్తాను.

మార్క్స్ ఆలోచనలు మానవ సమాజాన్ని విశ్లేషించి అర్థం చేసుకోవడానికే కాక, దాన్ని మార్చడానికి, సమసమాజాన్ని, నూతన మానవుడ్ని ఆవిష్కరించడానికి ఉద్దేశించబడ్డాయి. మార్క్సిజం యొక్క ప్రత్యేకత, గొప్పతనం అదే. సామాజిక మార్పులో వర్గపోరాటాల పాత్ర గురించి మార్క్స్ కన్నా ముందు కొంతమంది గుర్తించినా మార్క్స్ దాని ప్రాముఖ్యత గురించి నొక్కి చెప్పారు. ఆధునిక సమాజంలో వర్గాల మధ్య జరిగే సంఘర్షణలో కార్మికవర్గం యొక్క ప్రత్యేకత గురించి స్పష్టంగా గుర్తించినవాడు మార్క్స్. 1844లో 'హక్కుల'పై హెగెల్ తాత్విక అభిప్రాయాలను విమర్శిస్తూ, కార్మికవర్గాన్ని అన్ని వర్గాలు అనుభవించే బాధలను, అన్యాయాలను అణిచివేతలను తనవిగా భావించి వారందరి కోసం పోరాడగలదిగానూ, అందరి విముక్తిలోనే తన విముక్తిని చూడగల విశ్వజనీన శక్తిగానూ మార్క్స్ పేర్కొన్నాడు. 1845లో రాసిన 'హోలిఫ్యామిలి' గ్రంథంలో ఈ అంశాన్ని మరింత స్పష్టంగా పేర్కొన్నారు. 1848లో ప్రకటించబడిన 'కమ్యూనిస్టు ప్రణాళిక'లో ఈ ఆలోచనకు కార్యరూపమిచ్చారు. "కార్మికవర్గానికి పోయేదేమీలేదు సంకెళ్ళు తప్ప. సాధించడానికి మరో ప్రపంచమే వుంది. ప్రపంచ కార్మికులారా ఏకకండి" అని పిలుపునిచ్చారు. పిలుపునివ్వడమేగాదు కార్మికవర్గాన్ని సంఘటితం జేసేందుకు కృషిజేశారు. తన జీవితకాలంలో అంతర్జాతీయ కార్మిక సంఘం (మొదటి ఇంటర్నేషనల్) ద్వారా ప్రపంచ కార్మికవర్గానికి మార్గదర్శకత్వం వహించారు.

కార్మికవర్గ విప్లవ పాత్రపై మార్క్స్ అభిప్రాయాలను బూర్జువా మేధావులు, రివిజనిష్టులు నిరాకరిస్తూనే ఉన్నారు. పెట్టుబడిదారీ దోపిడీ వ్యవస్థను కూల్చే సామాజిక విప్లవ పోరాటంలో కార్మికవర్గ పాత్రకు సంబంధించి ఆనాటినుండి ఈనాటి వరకూ అభ్యంతరాలు వ్యక్తంజేయబడుతూనే వున్నాయి. ముఖ్యంగా గత మూడు దశాబ్దాల కాలంలో కార్మికవర్గ ప్రత్యేకతను ప్రశ్నించడం ఎక్కువయింది. వర్గపోరాట ఉనికినే ప్రశ్నించేవారు కార్మికవర్గ విప్లవకర పాత్రను నిరాకరించడంలో ఆశ్చర్యం లేదు. సమసమాజాన్ని కోరేవారు, సామాజిక మార్పును కాంక్షించేవారు సైతం కొందరు కార్మికవర్గ పాత్రను తృణీకరిస్తున్నారు.

కార్మికుల జీవన ప్రమాణాలు బాగా మెరుగుపడ్డాయని, క్రూరమైన దోపిడీ పద్ధతులు పోయాయని, శారీరక శ్రమ తగ్గిపోయిందని,

యాంత్రీకరణ, ఆటోమేషన్ మూలంగా ఉత్పత్తిలో శ్రమ పాత్ర తగ్గిపోయిందని, కృత్రిమ మేధస్సు మానవ శ్రమ అవసరాన్ని కూడా తగ్గించేస్తుందని... ఈ పరిణామాలన్నీ సమా జంలో కార్మికుల పాత్రను తగ్గించా యనీ, ఉన్న కార్మికవర్గంలో కూడా విప్లవత త్వాన్ని తొలగించిందనీ వాదిస్తున్నారు. అయితే ఈ వాదనలన్నీ ఒక మౌలికమైన విషయాన్ని మర్చిపోతున్నాయి. ఎన్ని మార్పు లొచ్చినా పెట్టుబడిదారీ వ్యవస్థలో శ్రమశక్తి సరుకుగా కొనసాగడంలో ఏ మార్పూ లేదు. బ్రతకడం కోసం శ్రమను వేతనానికి అమ్ముకునే పెట్టుబడిదారీ విధాన మౌలిక లక్షణంలో ఎటువంటి మార్పు లేనంతకాలం కార్మిక వర్గం బానిస సంకెళ్ళతో వున్నట్లే. ఇది ఉన్నంతకాలం వ్యవస్థను మార్చాలన్న కార్మికవర్గ ఆకాంక్ష సజీవంగానే వుంటుంది. దాన్ని నెరవేర్చుకోవడానికి ప్రయత్నాలు జరుగుతూనే వుంటాయి. అయితే మార్క్స్ కాలం నాటికి ఈనాటికి కార్మికవర్గ పరిణామంలో, జీవన ప్రమాణాలలో, పొంది కలో, నైపుణ్యాలలో ఎటువంటి మార్పులు లేవని కాదు. ఈ మార్పులు మౌలిక స్వభావం కలిగినవి కావన్నదే గమనించాల్సిన విషయం. వచ్చిన మార్పులు కార్మికవర్గం సంఘటితం అయ్యే రూపాలలో, పోరాటంజేసే పద్ధతులలో తప్పక మార్పులు తెస్తాయి. కార్మికోద్యమం, విప్లవోద్యమం మార్పులకనుగుణంగా వర్గ పోరాటాన్ని నిర్వహించాల్సి వుంటుంది. వర్గాల గురించి, కార్మికవర్గం గురించి మార్క్స్ చెప్పిన విషయాలను నెమరువేసు కొంటే కార్మికవర్గ నాయకత్వ ప్రాధాన్యతను ఏమాత్రం విస్మరించడం సాధ్యంకాదనే విషయం స్పష్టం అవుతుంది.

పెట్టుబడిదారీ వ్యవస్థను కూల్చి వేయగల విప్లవకర శక్తిగా కార్మికవర్గాన్ని గుర్తించడమే గాదు, దానికి ఒక సిద్ధాంత ఆయుధాన్ని ఇవ్వదల్చాడు మార్క్స్. ఐరోపా దేశాలలో 1848లో విప్లవాలు విఫలమయిన తర్వాత తన సమయాన్ని, శక్తిని మొత్తం రాజకీయ అర్థశాస్త్ర అధ్యయనానికి వినియోగించారు. రెండు దశాబ్ధాల కఠోర కృషి ఫలితంగా పెట్టుబడి గ్రంథం రూపుదిద్దు కున్నది. ఈ గ్రంథం మొదటి సంపుటం 1867లో ప్రచురణ అయింది. ప్రారంభంలో బూర్జువా మేధావులు ఈ పుస్తకం ఉనికిని గుర్తించ నిరాకరించారు. నిశ్శబ్ధంతో దాని గొంతు నొక్కాలనుకున్నారు. ఇందులో ఆశ్చర్యపడాల్సింది ఏమీ లేదు. పెట్టుబడి గ్రంథం పెట్టుబడిదారీ వ్యవస్థ గమన సూత్రాలను వెలికితీసింది. నిరంతర దోపిడీ లక్ష్యంతో సాగే వ్యవస్థ వైరుధ్యాలను బట్టబయలుజేసింది. వ్యవస్థ అంతంతోనే ఈ వైరుధ్యాలు పరిష్కారం అవుతాయని నిరూపి ంచింది. పెట్టుబడిదారీ వ్యవస్థ నిరంతరం సంక్షోభాల బారిన పడుతుందని, దాని నాశనం తప్పదని శాస్త్రీయంగా విశ్లేషిం చింది. బూర్జువా వర్గంపై గురిపెట్టబడిన అత్యంత శక్తివంతమైన 'క్షిపణి'గా పెట్టుబడి గ్రంథాన్ని తన స్నేహితునికి రాసిన ఉత్తరంలో మార్క్స్ పేర్కొన్నారు. అటువంటి గ్రంథం పట్ల బూర్జువా వర్గం ఎలా స్పందిస్తుందో వేరే చెప్పనక్కరలేదు. కానీ అనతికాలంలోనే పెట్టుబడి గ్రంథం కార్మికవర్గంలోకి వ్యాపిం చింది. పలు భాషల్లోకి అనువాదం అయ్యింది. అందుకే ఎంగెల్స్ పెట్టుబడి గ్రంథాన్ని 'కార్మికవర్గం యొక్క బైబిల్' గా తన ఉపో ద్ఘాతంలో పేర్కొన్నారు.

మొదటి నిశ్శబ్దం ద్వారా అది సాధ్యం కాదనుకున్న తర్వాత ఎదురుదాడి ద్వారా పెట్టుబడి గ్రంథాన్ని బూర్జువా మేధావులు ఎదుర్కొన్నారు. పెట్టుబడి గ్రంథం అత్యంత దుర్భర దారిద్ర్యాన్ని అనుభవించిన ఒక మేధావి ఆక్రోశం, ఆవేదన, ఆగ్రహం, ఊహలు తప్ప దానిలో శాస్త్రీయత ఏమీ లేదని కొట్టిపారేశారు. మార్క్స్ చేసిన కొన్ని నిర్ధారణలు తప్పయినాయని, ఆయన వేసిన లెక్కలు తప్పని, ఆయన ఆధారపడిన భావనలు (అసంప్షన్స్) తప్పని, పారిశ్రామి కాభివృద్ధి ప్రాథమిక స్థాయిలో వున్నప్పటి పరిస్థితులకు మార్క్స్ విశ్లేషణ వర్తించవచ్చు గానీ, ఆధునిక పరిస్థితులకు వర్తించదని – ఇలా అనేక వాదనలతో మార్క్స్ పెట్టుబడి గ్రంథాన్ని తిరస్కరించడానికి పూనుకున్నారు. 90వ దశకంలో అనేక దేశాల్లో సోషలిస్టులు కుప్పకూలడం, మార్క్స్ సిద్ధాంతాలు, ముఖ్యంగా ఆర్థిక శాస్త్రం పొరపాటనడానికి తుది సాక్ష్యంగా ప్రచారం చేశారు.

కార్మికోద్యమానికి ఎదురుదెబ్బలు తగిలినప్పుడల్లా మార్క్సిజానికి కాలం చెల్లిందని ప్రకటించడం కొత్త కాదు. పెట్టుబడిదారీ విధానం సంక్షోభంలో పడినప్పుడు, కార్మికోద్యమం పుంజుకున్నప్పుడు మార్క్సిజం పట్ల ఆసక్తి పెరగడం కూడా కొత్త కాదు. నేడు అటువంటి ఆసక్తి మళ్ళీ చూస్తున్నాము. 2008 ప్రపంచ మాంద్యం నుండి పెట్టుబడిదారీ దేశాలు, సరళీకరణ విధానాలు ఎదుర్కొం టున్న సవాళ్ళను అర్థంజేసుకోడానికి ఉప యోగపడుతున్న దశలో పెట్టుబడి గ్రంథం పట్ల ఆసక్తి పెరిగింది. వాస్తవంగా పెట్టుబడి గ్రంథం నేడు పెట్టుబడిదారీ వ్యవస్థ ఎదుర్కొం టున్న సంక్షోభ పరిస్థితులను అర్థంజేసు కోవడానికి సమసమాజ స్థాపనకోసం పోరడడానికి కార్మికవర్గానికి గొప్ప పోరాట సాధనంగా ఉపయోగపడుతుంది.

కార్మికవర్గాన్ని పెట్టుబడిదారీ వ్యవస్థను కూల్చి సోషలిజాన్ని స్థాపించగల రాజకీయ శక్తిగా మార్క్స్ పేర్కొన్న విషయం 1917 అక్టోబర్ విప్లవం రుజువుజేసింది. రష్యాలో కార్మికవర్గం నాయకత్వాన రైతాంగం, ఇతర శ్రామిక ప్రజలు జారు చక్రవర్తి పాలనను కూలదోసి కార్మిక, కర్షక సోవియట్ల ఆధ్వర్యంలో కార్మికవర్గ రాజ్యాన్ని స్థాపించింది. ఫ్యూడల్, పెట్టుబడిదారీ వ్యవస్థలను కూకటి వేళ్ళతో పెకలించి సమసమాజ నిర్మాణానికి బాటలు వేసింది. అధికారం చేబట్టిన వెంటనే అసమాన యుద్ధ ఒడంబడికలన్నింటినీ రద్దు చేసి, అణచివేయబడిన జాతులన్నింటికీ స్వేచ్ఛ నిచ్చి అంతర్జాతీయతను చాటి చెప్పింది. బడా పెట్టుబడిదారుల ఆస్థులను, భూస్వాముల భూములను స్వాధీనం చేసుకున్నది. సమిష్టి, సహకార ఉత్పత్తి సంబంధాలను, పంపిణీ వ్యవస్థలను అభివృద్ధి చేసింది.

చదువు, ఆరోగ్యం, ఆహారం, ఆవాసం, ఉపాధిలను హక్కులుగా చేసి ప్రజలందరికీ గ్యారెంటీ చేసింది. అన్ని రకాల అసమాన తలను (జాతి, లింగ, వర్గ తదితర) రద్దు చేసి విశ్వజనీన సమానత్వాన్ని నిజం చేసింది.

**(తరువాయి భాగం 28వ పేజీలో...)**

# భారత పారిశ్రామికాభివృద్ధికి సోవియట్ యూనియన్ అద్భుత సహాయం

- సీహెచ్. నరసింగరావు



భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చేనాటికి పారిశ్రామికంగా పూర్తిగా వెనుకబడివుంది. దాదాపు 300 సంవత్సరాల ఈస్టిండియా బ్రిటీష్ పాలకులు భారతదేశం నుంచి విదేశాలకు ముడిసరుకులు తరలించేవారు. మన ముడిసరుకులు ఉపయోగించుకొని విదేశాల్లో సరుకులు తయారుచేసి మన దేశంలో ఎక్కువ ధరలకు అమ్మేవారు. మన దేశంలో పరిశ్రమలు అభివృద్ధికాకుండా సామ్రాజ్యవాదులు అడ్డుపడ్డారు. 1917లో సోవియట్‌లో అక్టోబర్ విప్లవం తరువాత భారతదేశం స్వాతంత్ర్య ఉద్యమం ఊపందుకుంది. అక్టోబర్ విప్లవ ప్రభావం భారతదేశ ప్రజలపై పడింది. ఫలితంగా 1947లో స్వాతంత్ర్యం వచ్చింది. రష్యా సహాయంతో భారతదేశం పారిశ్రామికంగా అభివృద్ధి చెందింది.

స్వాతంత్ర్యం వచ్చేనాటికి మన దేశంలో ఒక్క ప్రాధాన్యత పరిశ్రమ కూడా ఏర్పడలేదు. గుండుసూదులు కూడా దిగుమతి చేసుకొనేవారం. రసాయనిక ఎరువులంటే ఏమిటో తెలియదు. అంటు వ్యాధులతో ఏటా లక్షలాది మంది ప్రజలు చనిపోతున్నా పెన్సిలిన్ లాంటి ప్రాథమిక మందులు కూడా మన దేశంలో ఉత్పత్తిలేదు. విద్యుత్, సిమెంట్, ఉక్కు ఆయిల్ లాంటి అన్ని రంగాల్లోనూ అత్యంత వెనుకబడి ఉన్నాం. స్వాతంత్ర్యం అనంతరం నెహ్రూ ప్రభుత్వం ఆనాటి అమెరికా అధ్యక్షుడు కెనడీ చుట్టూ ప్రదక్షణలు చేసింది. ఆహార ధాన్యాలకు సహాయం అందించాలని ప్రాధేయపడింది. నెహ్రూ-కెనడీ భాయిభాయి అని కెనడీని భారతదేశానికి ఆహ్వానించి మరీ బతిమిలాడింది. "ఎక్కడైనా బావ కానీ వంగతోట వద్ద కాదు"అన్న చందంగా భారతదేశానికి ఆహార ధాన్యాలివ్వడానికి అమెరికా తిరస్కరించింది. "పబ్లిక్ లా 480" ఒప్పందం ప్రకారం పనికిరాని సముద్రంలో పారబోసే గోధుమలను అమెరికా భారతదేశానికి అమ్మింది. మందులు తయారుచేసే ఫార్మా కంపెనీ డిజైన్ ఇవ్వమనే కోర్కెను అమెరికా తిరస్కరించింది. భారతదేశానికి కావల్సిన మందులు అమ్ముతాంకానీ ఫార్మా కంపెనీ డిజైన్ ఇవ్వం అని తెగేసి చెప్పింది. ఈ విషయం తెలిసిన రష్యా భారతదేశాన్ని ఆహ్వానించి ఫార్మా కంపెనీల డిజైన్‌ను అందించింది. రష్యా సహాయం అందిస్తుందని భారతదేశానికి అర్థం అవ్వడంతో ఫార్మా కంపెనీల నిర్మాణానికి ఆర్థిక సహాయం అందించాలని కోరింది. రష్యా వెంటనే భారతదేశంలోని బెంగుళూర్, హైదరాబాద్, భూపాల్, హరిద్వార్‌లలో ఇండియన్ డ్రగ్స్ ఫార్మాస్యూటికల్ లిమిటెడ్ (ఐడీపీఎల్) ఫార్మా కంపెనీలను నిర్మించింది. దీంతో పెన్సిలిన్ టెట్రాసైక్లిన్ లాంటి ప్రాథమిక మందులన్నీ మన దేశంలో ఉత్పత్తి ప్రారంభించాం. లక్షలమంది అంటు వ్యాధులతో మరణించడం ఆగిపోయింది.

భారతదేశంలో హరిత విప్లవం విజయవంతానికి కీలకం రసాయనిక ఎరువులు. రష్యా సహాయంతో ఫెర్టిలైజర్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా నెలకొల్పబడింది. పంటల ఉత్పత్తి రెట్టింపు అయ్యింది. తక్కువ కాలం పంటలు వేయడం ప్రారంభించారు. దేశాభి వృద్ధిలో కీలకమైన స్టీల్ ఉత్పత్తికి స్వాతం త్ర్యం వచ్చేనాటికి టాటా స్టీల్ కంపెనీ ఒక్కటే ఉంది. మహాత్మాగాంధీ పిలుపుతో 5 రూపాయలు చెల్లించే వారందర్నీ షేర్ హోల్డర్స్‌గా చేర్చుకొని మన దేశంలో పరిశ్రమలు ఏర్పాటు చేయాలనే పిలుపుతో టాటా స్టీల్ ఏర్పడింది. అందుకే నేటికీ టాటా స్టీల్లో ప్రజల వాటాలు 75 శాతం ఉన్నాయి. టాటా వాటా 25 శాతం మాత్రమే. దాని సామర్థ్యం అతి తక్కువ. భారతదేశంలో రష్యా ఆర్థిక, సాంకేతిక సహాయంతో భిలాయ్, బొకారో లాంటి భారీ సంస్థలు 1960 దశకంలో ఏర్పడ్డాయి. దేశాభివృద్ధికి స్టీల్ ఎంతో తోడ్పడింది. వంతెనలు, భారీ బ్రిడ్జిలు, భారీ పరిశ్రమల నిర్మాణాలకు స్టీల్‌ప్లాంట్లే ప్రధాన కారణం. 1980వ దశకంలో కూడా విశాఖ స్టీల్‌ప్లాంట్‌లోని కీలకమైన బ్లాస్ట్‌ఫర్నేస్‌ను రష్యా నిర్మించింది. నేటికీ 120 శాతం ఉత్పత్తి సామర్థ్యంతో నడుస్తోంది. భారతదేశంలో కోల్, ఇంజినీరింగ్, ఆయిల్, గనులు లాంటి అనేక కీలకరంగాల ఏర్పాటుకు రష్యా సంపూర్ణంగా సహకరించింది.

రష్యా ఆర్థిక సహాయమంతా వస్తుమార్పిడి ద్వారా జరిగింది. రష్యా భారీ పరిశ్రమలను మనకు అందించింది. మనకు బాగా పండే పొగాకు, తోళ్లు తదితర సరుకులను రష్యాకు ఎగుమతి చేశాం. వారి సాంకేతిక నైపుణ్యాన్ని కూడా అతి చౌకగా అందించడం వల్ల భారతదేశంలో

ప్రభుత్వరంగం బాగా బలపడింది. అభివృద్ధి చెందిన అమెరికా, యూరప్ ఖండంలోని అనేక దేశాలు 2008 ఆర్థిక సంక్షోభానికి తీవ్రంగా దెబ్బతిన్నా భారత్‌లో ఆర్థిక వ్యవస్థ పటిష్టంగా ఉండడానికి ప్రధాన కారణం ప్రభుత్వరంగం. అందులో ఏర్పడిన ఏ ఒక్క పరిశ్రమను మనం సొంతగా నిర్మించే శక్తిలేని కాలంలో రష్యా మనకు ఎంతో సహాయ పడింది. ఈనాటికీ స్టీల్ లాంటి భారీ పరిశ్రమలను ప్రైవేట్ సంస్థలు ఏర్పాటు చేయడానికి అంతగా ఆసక్తి చూపడంలేదు. నిర్మాణకాలం 5 నుంచి 10 సంవత్సరాలు పడుతుంది. లాభాలు తరు వాత వస్తాయి. కానీ పెట్టుబడిదారులకు తక్షణం లాభాలు రావాలి. రష్యన్ కార్మికవర్గం తమ శ్రమను యావత్తు ప్రపంచ ప్రజానీకానికి పంచింది. తమ అశేషమైన త్యాగాలతో రెండో ప్రపంచ యుద్ధానంతరం రోజుకు 15 గంటలు పనిచేసి ముందు రష్యాను పునఃనిర్మించింది. రెండో ప్రపంచ యుద్ధంలో రష్యా ప్రజలు, రెడ్ ఆర్మీ త్యాగాలు ప్రపంచం ఎన్నటికీ మరవ లేదు. రెండు కోట్ల మంది ప్రజలు ప్రాణాలు కోల్పోయారు. మరో రెండు కోట్ల మందికి కాలు, చెయ్యి, కన్ను, ముక్కు ఏదో ఒక అవయవం కోల్పోయి వికలాంగుల య్యారు. కొన్ని గ్రామాల్లో మగవారే లేని పరిస్థితి ఏర్పడింది. అయినా రష్యాను నిర్మించుకొని రష్యాతో పాటు ప్రపంచంలో అనేక అలీన దేశాలకు రష్యా సంపూర్ణ సహకారం అందించింది. సామ్రాజ్యవా దానికి వ్యతిరేకంగా నిలబెట్టే కృషిలో భాగంగా వెనుకబడిన దేశాలకు షరతు ల్లేకుండా అతి చౌకగా సహాయాన్ని అందించింది.

ప్రపంచ ప్రధాన శత్రువు సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా వలస దేశాలకు రష్యా సహాయపడింది. వలసల నుంచి విముక్తి పొందిన తరువాత సుమారు 120 దేశాలకు ఆర్థిక, పారిశ్రామిక, రాజకీయ సహాయాన్ని అందించింది. ఏ సామ్రాజ్యవాద దేశం దాడిచేయడానికి పూనుకున్నా దానిని రష్యా ఎదిరించింది. చిన్న దేశాలైన వియత్నాం, ఉత్తరకొరియా, క్యూబా దేశాలకు అండగా నిలబడింది. క్యూబా విప్లవం సాధించిన అనంతరం 1959 నుంచి 91 వరకు ఆయిల్, ఆహార ధాన్యాలను క్యూబాకు అందించడం చాలా ముఖ్య సహాయం. ఆఫ్రికన్‌దేశాల విముక్తికి తోడ్పడింది. సామ్రా జ్యవాద విస్తరణ కాంక్షతో అనేక దేశాలపై దాడులు చేయడం, బెదిరించడం వీరినైజం. హింసకు దిగజారడం వీరి లక్షణం. రష్యాలో ఏర్పడిన ప్రథమ సోషలిస్టు దేశం ద్వారా ప్రపంచ శ్రామికవర్గానికి ప్రత్యామ్నాయం దొరికింది. విద్యా, వైద్యం, ఉపాధి ప్రజలకు ప్రాథమిక హక్కుగా ఉంటుందని ప్రపంచ ప్రజలకు అర్థమైంది. దోపిడీలేని పాలనను సాధించుకొనే వరకు శ్రామికవర్గం పోరాడు తూనే వుంటుంది.

**సోవియట్ అక్టోబర్ విప్లవం మన మార్గం**

**అమెరికన్ సామ్రాజ్యవాదం నశించాలి.**



# శ్రీ వేంకటేశ్వర స్వామి వారి దేవస్థానము

ద్వారకాతిరుమల (చిన్నతిరుపతి), ప॥గో॥జిల్లా పిన్: 534426. ఫోన్: 08829 - 271427
ఆలయ కార్యాలయం : 08829 - 271469, ఫ్యాక్స్ : 08829 - 271766
website : www.dwarakatirumala.org/email: eo_dwarakatirumala@yahoo.co.in

గో పూజకు మించిన పూజ మరొకటి లేదు. గోవులు పవిత్ర మైనవి. గోదానము పాపనమైనది.
భూత భవిష్యత్ వర్తమాన సంపదలు గోవులే. గోవులయందు సర్వదేవతలు నెలవై ఉన్నారు.
గోపూజ గో ప్రదక్షిణ చేయండి ...! సమస్త శుభ ఫలితాలను పొందండి!!

1116/-రూ, ఆ పైన విరాళములు చెల్లించగోరు దాతలు కార్యనిర్వాహణాధికారి, గోసంరక్షణ పథకం ట్రస్ట్, శ్రీ వేంకటేశ్వరస్వామి వారి దేవస్థానం, ద్వారకాతిరుమల పేరున చెక్ లేదా డి.డిల ద్వారా చెల్లించవచ్చును.

## శ్రీ స్వామి వారి విమాన గోపుర స్వర్ణమయ పథకము

ద్వారకా తిరుమల క్షేత్రము పురాణ ప్రసిద్ధమై త్రేతాయుగము నుండి దశరథ మహారాజు శ్రీ రామచంద్రమూర్తి మొదలగు పురాణ పురుషులచే ఆరాధించబడిన ప్రసిద్ధ పురాతన క్షేత్రము, ద్వారక మహర్షి తపఃప్రభావ ప్రకటితమైన ఈ క్షేత్రమే చిన్నతిరుపతి. అట్టి ఈ క్షేత్రములోని శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఆలయ విమానము (గుడి గోపురము)నకు బంగారు తాపడము చేయించాలని శుభ సంకల్పం చేయటం జరిగింది.

శ్రీ స్వామి వారి దర్శనం కాని వారు దూరం నుండే స్వామివారి గుడి శిఖరాన్ని దర్శించుకుంటేనే స్వామివారిని దర్శించిన పుణ్యం కలుగుతుందని శాస్త్ర వచనము. అట్టి పవిత్రమయిన శ్రీ ద్వారకా తిరుమలేశుని బంగారు తాపడం చేయటానికి వదాన్యులయిన భక్త శిఖామణుల నుండి దాతల నుండి భూరి విరాళములుబంగారం రూపేణ, ధనరూపేణ కోరబడుచున్నవి. భక్తులు యుధాశక్తి ఈ మంచి అవకాశాన్ని సద్వినియోగ పరచు కొనగలరు. దాతలు రూ.1116/-లు ఆపైన విరాళములు చెల్లించి చరిత్రలో శాశ్వతంగా నిలబడి ఉండే పరమ పావనము అయిన ఈ బృహత్కారము నందు తమ వంతు సహకారాన్ని అందించి శ్రీ స్వామివారి కృపకు పాత్రులు కావలసినదిగా కోరు చున్నాము.

డిమాండ్ డ్రాఫ్ట్ / చెక్కులు /పే ఆర్డరులను కార్యనిర్వాహణాధికారి, శ్రీ వేంకటేశ్వర స్వామి వారి దేవస్థానము, ద్వారకాతిరుమల, ప.గో.జిల్లా పేరున, ఆన్‌లైన్ ద్వారా నగదు పంపించుటకు

కరెంట్ **A/c No. 010710100058873, IFSC CODE : ANDB0000107. Online Donations through website http://www.dwarakatirumala /org/ols.html** ద్వారా మరియు ఆంధ్రప్రదేశ్‌లో ఎక్కడైనా ఎ.పి ఆన్‌లైన్ కౌంటర్స్ ద్వారా ఈ స్కీమునకు చెల్లించవ చ్చును.

గమనిక : దాతలు బంగారము రూపంలో కూడా శ్రీ స్వామివారి విమాన గోపుర స్వర్ణమయ పథకమునకు విరాళముగా ఇవ్వవచ్చును.

## శాశ్వత అన్నదాన పథకము ట్రస్ట్

శాశ్వత అన్నదాన పథకము:

1. మహా అన్నదాత : రూ.3,65,000/-లు మరియు ఆ పైన
2. మహారాజ పోషకులు : రూ.1,00,000/-లు మరియు
3. రాజపోషకులు : రూ.50,000/-లు నుండి 1,00,000/-లోపు
4. పోషకులు : రూ.10,000/-ల నుండి 50,000/- లోపు
5. దాతలు : రూ.10,000/- లోపు

చెల్లించువారు ఆలయ ప్రాంగణంలోని అన్నదాన భవనములో ఉదయం 11 గంటల నుండి మ.3 గంటల వరకు యాత్రీకులకు ఉచిత భోజన సౌకర్యం ఏర్పాటు చేయడమైనది. అదనముగా ప్రతి శుక్రవారం రాత్రి 7.30 ని॥ల నుండి అన్నప్రసాదము ఏర్పాటు జరుగుచున్నది. ఉచిత భోజన ప్రసాదం కూపన్లు అన్నదాన భవనము ఎదురుగా ఇవ్వబడును.

## శ్రీ వేంకటేశ్వర స్వామి వారి ప్రాణదాన ట్రస్ట్

దేవస్థానం ఆధ్వర్యంలో కుల, మత, వర్ణ, వర్గ విబేదాలు లేకుండా ఉచితముగా వైద్యసేవలు అందించుటకు సంజీవిని ట్రస్టు నెలకొల్పబడినది. క్యాన్సర్, గుండె, మెదడు, మూత్రపిండాలు మూత్రపిండాలు మొదలగు వ్యాధులతో బాధపడుచూ ఖరీదైన వైద్యము చేయించుకోనేనివారికి మరియు స్వామి వారిని దర్శించిన భక్తులకు వైద్యసేవలు అందించుట ట్రస్ట్ ప్రధాన లక్ష్యం, కావున దాతలు తమ విరాళములను కార్యనిర్వహణాధికారి,శ్రీ వేంకటేశ్వరస్వామి వారి దేవస్థానం, ప్రాణదాన ట్రస్ట్ పేరున ద్వారకతిరుమలలో చెల్లువిధముగా బ్యాంకు /డిడి/చెక్కు/యం.ఒ. ద్వారా పంపవచ్చును.

**పై రెండు పథకములకు విరాళములు ఇచ్చు దాతలు ఇన్‌కమ్‌టాక్స్ యాక్ట్‌లోని సెక్షన్ 80(జి) క్రింద మినహాయింపు కలదు.**

శ్రీ.ఎన్.వి. సుధాకరరావు
అధ్యక్షులు మరియు వ్యవస్థాపక ధర్మకర్త

వేండ్ర త్రినాధరావు
కార్యనిర్వాహణాధికారి మరియు సంయుక్త కమీషనరు

# మానవ జాతి చరిత్రలోనే మహోజ్వల ఘట్టం

# 1917 - రష్యా సోషలిస్టు విప్లవం

- ఎం.ఏ. గఫూర్

లక్షల సంవత్సరాల మానవ ఇతిహాసంలో కొన్ని విప్లవాలు చరిత్ర గతినే మార్చి వేశాయి. బానిస విధానానికి వ్యతిరేకంగా మధ్య యుగాల్లో జరిగిన బానిసల తిరుగుబాట్లు ప్రత్యేకించి రోమన్ సామ్రాజ్యంలో స్పార్టకస్ నాయకత్వాన జరిగిన తిరుగుబాటు ప్రపంచంలో బానిస విధానం అంతరించడానికి దోహదం చేసింది. అలాగే స్వేచ్ఛ, సౌభ్రాతృత్వం నినాదంతో 1779 లో సాగిన ఫ్రెంచ్ విప్లవం ప్రపంచ దేశాల్లో నిరంకుశ రాచరిక వ్యవస్థ అంతమై ప్రజాస్వామ్య ప్రభుత్వాలు ఏర్పడడానికి దారి తీసింది. 1871లో ప్యారిస్‌లో జరిగిన కార్మికుల తిరుగుబాటు సమాజంలో కొత్త కోణాన్ని ఆవిష్కరించింది. కార్మికులు కేవలం ఉత్పత్తి సాధనాలుగా మాత్రమే కాదు సమాజాన్ని పాలించే సామర్థ్యం వారికి ఉందని, బూర్జువా వర్గాన్ని కూలదోసి కష్టజీవుల ప్రభుత్వాలు ఏర్పాటు చేసుకుంటే, పీడిత ప్రజలందరికీ మంచి భవిష్యత్ ఉంటుందని ప్యారిస్ కమ్యూన్ తిరుగుబాటు రుజువు చేసింది. కొద్ది రోజులు మాత్రమే అధికారంలో ఉండి ఆ తరువాత బూర్జువా వర్గం చేత అణిచివేయబడినప్పటికి ప్యారిస్ కమ్యూన్ తిరుగుబాటు ప్రపంచ కార్మిక వర్గానికి అనేక పాఠాలను అందించింది.

ప్రపంచ విప్లవాల్లోకెల్లా తలమానికంగా చెప్పుకునేది 1917లో జరిగిన రష్యా విప్లవం. దోపిడీ రహిత సోషలిస్టు సమాజాన్ని స్థాపించుకోవడం ద్వారానే మానవ జాతి అన్ని రంగాల్లో పురోగతి సాధించగలదని, సోషలిజం ద్వారానే ప్రజలందరూ సుఖ సంతోషాలతో బతికే వ్యవస్థను నిర్మించుకోవచ్చని మార్క్స్, ఏంగెల్స్‌లు సైద్ధాంతికంగా చెప్పిన విషయాలను మహనీయుడు లెనిన్ నాయకత్వంలోని బోల్షివిక్ పార్టీ రష్యాలో నిజం చేసింది. ఒక మనిషిని మరొక మనిషి, ఒక జాతిని మరొక జాతి దోచుకునే వ్యవస్థను కూల్చివేసి సర్వమానవ సమానత్వాన్ని గ్యారెంటీ చేసే సోషలిస్టు సమాజాన్ని నిర్మించడం కేవలం 'కల' కాదని, ప్రజలు చైతన్యవంతులై పోరాడితే స్వర్గం ఎక్కడో కాదు, తమ తమ దేశాలనే స్వర్గ తుల్యంగా మార్చుకోవచ్చని రష్యా విప్లవం రుజువు చేసింది. ఒక వెనుకబడిన దేశంలో, అందులోనూ ఉత్పత్తి శక్తులు ఇంకా పూర్తిగా అభివృద్ధి కాని దశలో పాలక వర్గాలకు సమాజంలోని ప్రజలకు మధ్య వైరుధ్యాల్ని జాగ్రత్తగా అధ్యయనం చేసి ప్రజలను చైతన్యపర్చి, కర్తవ్యోన్ముఖులుగా చేస్తే సమాజంలో సమూల మార్పు సాధించవచ్చని ప్రపంచ ప్రజానీకానికి రష్యా విప్లవం గొప్ప అనుభవాన్ని ఇచ్చింది.



మానవుని జీవితం అతని లలాట లిఖితమని, ఎవరూ మార్చలేరనే బూటకపు సిద్ధాంతాలతో, మత బోధనలతో సమాజంలో ఆధిపత్యంలో ఉన్న దోపిడీ వ్యవస్థను బలపరిచి, దోపిడీ దారుల కొమ్ము కాసే భావవాద సిద్ధాంతాన్ని రష్యా విప్లవం పటాపంచలు చేసింది. ఎవరి తలరాత వేరెవరో రాయరని కార్మికవర్గం, కష్టజీవులు ఐక్యమైతే తమ భవిష్యత్‌ను తావే నిర్ణయించుకోగలరనే విశ్వాసాన్ని ప్రపంచ కార్మికవర్గంలో రష్యా విప్లవం కలిగించింది. సమాజంలోఅసమానతలు సహజమైనవని, దోపిడీ రహిత సమాజ నిర్మాణం అసాధ్యమని వాదించే పాలక వర్గాలు, వారి తొత్తులైన బూటకపు ఆర్థికవేత్తల వాదనలను పటాపంచలు చేస్తూ సమాజంలో ప్రజలందరి సమానత్వమే అత్యంత సహజమైనదని, దోపిడీ వ్యవస్థను నిర్మూలిస్తే అన్ని తరగతుల ప్రజలు సుఖసంతోషాలతో అభివృద్ధి చెందుతారని చెప్పే సోషలిస్టు సిద్ధాంతం "స్వప్నం కాదు వాస్తవం" అనే విషయాన్ని ప్రపంచ ప్రజలందరి ముందూ రష్యా విప్లవం ఆవిష్కరించింది. కార్మికులు, కర్షకులు, పీడితులు, తాడితులు, సకల జాతుల ప్రజలు కలిసి పోరాడితే సోషలిజం నిర్మించడం సాధ్యమే అనే విషయాన్ని మొదటి కార్మికవర్గ విప్లవం నిరూపించింది.

విప్లవం తర్వాత రష్యా రూపురేఖలే మారిపోయాయి. భూమిని భూస్వాముల నుండి స్వాధీనం చేసుకొని రైతులకు, వారి సహకార సంఘాలకు పంపకం చేశారు. వ్యవసాయంలోని ఉత్పత్తి ఫలాలు నేరుగా రైతులకే అందటంతో వారి జీవితాల్లో చాలా మెరుగైన ఫలితాలు వచ్చాయి. పరిశ్రమలన్నీ జాతీయం చేయబడ్డాయి. కార్మికులే యజమానులుగా ప్రకటించబడ్డారు. సత్వర పారిశ్రామికీకరణ కొరకు, ఆర్థిక అభివృద్ధి కొరకు అమలు జరిగిన పంచవర్ష ప్రణాళికలు అద్భుత ఫలితాలనిచ్చాయి.

అనతి కాలంలోనే రష్యా అత్యంత అభివృద్ధి చెందిన పారిశ్రామిక దేశంగా అవతరించింది. పేదరికం, దారిద్ర్యం, నిరుద్యోగం లాంటి ఏ సమస్య లేనటువంటి కొత్త వ్యవస్థ ప్రపంచంలో ఆవిష్కరించబడింది. అందరికీ ఉచిత విద్య, ఉచిత వైద్యం గ్యారంటీ చేయబడ్డాయి. ప్రపంచంలోనే మానవ అభ్యుదయానికి, విలువలకు చిహ్నంగా కొత్త వ్యవస్థ రష్యాలో సాక్షాత్కరించింది. ప్రపంచ వ్యాప్తంగా కార్మికవర్గం, పీడిత ప్రజలు, రష్యా సోషలిజంలాంటి వ్యవస్థ తమకూ కావాలని కాంక్షించడం, దాన్ని సాధించడానికి సంఘటితం కావడం ప్రారంభమైంది.

రష్యాను నేలమట్టం చేసి సోషలిస్టు సిద్ధాంతాన్ని, వ్యవస్థను నాశనం చెయ్యకపోతే సోషలిజం ప్రభావం ప్రపంచ మంతటా విస్తరించి పెట్టుబడిదారీ విధానానికి తీవ్ర సవాలుగా మారే ప్రమాదం ఉన్నందున ఆదిలోనే దాన్ని తుంచి వెయ్యాలని హిట్లర్, ముసోలినీ లాంటి ఫాసిస్టు నేతలు రెండో ప్రపంచ యుద్ధంలో తమ సైన్యాన్నంతా మోహరించి రష్యా పై దాడి చేశారు. సోషలిస్టు ప్రభుత్వాన్ని కూల్చివెయ్యాలని ప్రయత్నించారు. అయితే కోట్లాది రష్యా పౌరులు తమ మాతృదేశాన్ని, సోషలిస్టు వ్యవస్థను పరిరక్షించుకోవడానికి ఎర్రసైన్యంతో కలిసి పోరాడారు. రెండో ప్రపంచ యుద్ధం రష్యా విజయంతో అంతమైంది. ఫాసిస్టు శక్తులు చిత్తుగా ఓడాయి. హిట్లర్ ఆత్మహత్య చేసుకున్నాడు. ప్రజాస్వామ్య ప్రపంచం ఊపిరిపీల్చుకుంది. రష్యా, ఆదేశపు ఎర్రసైన్యం లేకుంటే మొత్తం ప్రపంచమే ఫాసిస్టు పద ఘట్టనల కింద నలిగిపోయేది. ఎర్రసైన్యం ప్రపంచంలోనే అత్యంత శక్తివంతమైనదిగా నిరూపించబడడంతో ప్రపంచ శాంతికి గ్యారెంటీ ఏర్పడింది. మార్కెట్ల కోసం ఇతర దేశాలపై దాడులు చేసే సామ్రాజ్యవాద సంస్కృతికి బ్రేకులు పడ్డాయి. సామ్రాజ్యవాద దేశాలు తోకలు ముడిచి తమ వలసలకు స్వాతంత్ర్యం ప్రకటించవలసి వచ్చింది. ప్రపంచంలోని అనేక వెనుకబడ్డ దేశాలపై కొన్ని పారిశ్రామిక దేశాలు పెత్తనం చేసే విధానం నశించింది. ఆ రకంగా రష్యా విప్లవం ద్వారా లభించిన స్ఫూర్తి, తోడ్పాటు మన దేశంలో జాతియోద్యమం ముందుకు సాగడానికి ఆ క్రమంలోనే 1947లో స్వాతంత్ర్యం సాధించుకోవడానికి ఎంతో తోడ్పడింది.

1917 విప్లవం ద్వారా రష్యా దేశంలో మాత్రమే కార్మికవర్గ ప్రభుత్వం ఏర్పడింది. అయితే 2వ ప్రపంచ యుద్ధంలో రష్యా విజయంతో, తూర్పు ఐరోపా దేశాల్లోని అనేక దేశాల్లో కార్మికవర్గం తిరుగుబాటు చేసి ప్రభుత్వాలను కూల్చివేసింది. పోలండ్, చెకొస్లోవేకియా, హంగరి, రుమేనియా, యుగోస్లావియా, బల్గేరియా తూర్పు జర్మనీతో పాటు అనేక ఐరోపా దేశాల్లో పీడిత ప్రజల ఆధ్వర్యంలో సోషలిస్టు ప్రభుత్వాలు ఏర్పడ్డాయి. 1945 వరకు రష్యా మాత్రమే సోషలిస్టు దేశంగా ఉండగా 1945 తరువాత అనేక సోషలిస్టు దేశాలతో కూడిన సోషలిస్టు కూటమి ఏర్పడింది.

రష్యా విప్లవ స్ఫూర్తితో చైనాలో కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన రైతాంగం కష్టజీవులు కలిసి మంచూరియా చక్రవర్తుల నిరంకుశ రాచరిక వ్యవస్థకు, భూస్వామ్య యుద్ధ ప్రభువుల దుర్మార్గపు పాలనకు వ్యతిరేకంగా సాయుధ పోరాటం ప్రారంభించారు. దీర్ఘకాలం సాగిన ఈ పోరాటం 'లాంగ్ మార్చ్'తో విజయవంతమైంది. సోషలిస్టు సమాజాన్ని చైనా దేశం సాధించుకుంది. ప్రపంచంలోనే అధిక జనాభా ఉన్న చైనా నేడు ప్రపంచంలోనే అత్యధికమైన వృద్ధి రేటును నమోదు చేస్తూ అప్రతిహతంగా పురోగమిస్తోంది. అన్ని దేశాల్లోనూ కార్మికుల నిజ వేతనాలు పడిపోతున్నాయని, చైనాలో మాత్రమే నిజవేతనాలు గణనీయంగా పెరుగుతున్నాయని అంతర్జాతీయ కార్మిక సంస్థ తన నివేదికలో చైనా ప్రత్యేకతను గూర్చి వివరించక తప్పలేదు. చైనా తన దేశంలోని ప్రజల మౌలిక సమస్యలన్నింటినీ పరిష్కరించి, ఆధునిక వసతులతో కూడిన జీవితాన్ని తన ప్రజలందరికీ గ్యారెంటీ చేసి వారి జీవన ప్రమాణాలను క్రమేపీ పెంచుకుంటూ పురోగమిస్తూ ఉంది. చైనా లక్షణాలతో కూడిన సోషలిజాన్ని తాము నిర్మిస్తున్నామని, సోషలిస్టు సిద్ధాంతం ద్వారానే ఈ విజయాలను సాధించామని చైనా కమ్యూనిస్టు పార్టీ చెబుతున్నది.

రష్యాలో సాగిన సోషలిస్టు మహావిప్లవ స్ఫూర్తితో అమెరికా దేశానికి అతి సమీపంలో గల క్యూబా అనే చిన్న దేశంలో కామ్రేడ్ ఫిడేల్ క్యాస్ట్రో నాయకత్వాన దేశభక్తులైన కొందరు యువకులతో ప్రారంభమైన సాయుధపోరాటం క్యూబా దేశ ప్రజలందరి మద్దతు పొంది సాయుధ తిరుగుబాటుగా మారి అక్కడున్న బ్యాటిస్టా సైనిక నియంతృత్వాన్ని ఓడించి సోషలిస్టు ప్రభుత్వాన్ని స్థాపించారు. నేడు ఈ చిన్న దేశం అమెరికా కల్పించే అన్ని అడ్డంకులను దాటుకుంటూ సోషలిజంలో సాగిపోతోంది. పీడిత ప్రజలకు వేగుచుక్కగా, వినీల ఆకాశంలో ప్రకాశిస్తున్న అరుణ తారగా ఉంటూ లాటిన్ అమెరికా దేశాల్లో వామపక్ష ఉద్యమానికి మార్గదర్శకంగా ఉంది.

ఉత్తరకొరియా ఒక చిన్న దేశం. ఈ రోజు అమెరికాను కూడా సవాల్ చేయగల సైనిక శక్తిగా ఆదేశం ఎదగడం ఎలా సాధ్యమయ్యిందో తెలియక కొందరు గందరగోళ పడుతున్నారు. అక్కడ సైనిక నియంతృత్వం ఉందని, ప్రజలందరినీ ఆకలి దప్పులతో మాడుస్తున్నారని, ప్రజల సమస్యలు ఏమీ పట్టించుకోకుండా కేవలం ఆయుధాల తయారీకి కృషి చేస్తూ ప్రపంచ శాంతికి విఘాతం కలిగిస్తున్నారని కొంత మంది మిడిమిడి జ్ఞానంతో మాట్లాడుతున్నారు. సోషలిస్టు ఉత్తర కొరియా దేశాన్ని నలిపి వేయాలని అమెరికా ఎప్పటి నుండో ప్రయత్నిస్తోంది. కానీ ఉత్తర కొరియా ఆత్మగౌరవాన్ని కాపాడుకుంటూ అంతరంగికంగా తమ ప్రజల అభివృద్ధికి తగిన చర్యలు తీసుకుంటూనే అమెరికా నుండి

కాపాడుకోవడానికి అనివార్యంగా ఆయుధాల్ని సమకూర్చుకుంటున్నారు. ప్రపంచ వ్యాపితంగా అణ్వాయుధాలను గుట్టలు గుట్టలుగా పేర్చిన అమెరికాను గురించి ఒక్క మాట మాట్లాడడానికి ధైర్యం చాలని ఈ కుహనా మేధావులు ఉత్తర కొరియాను అపహాస్యం చేయడంలో మాత్రం ముందున్నారు. అయితే సోషలిస్టు సమాజం తమ శక్తినంతా నవీకరించుకొని



దురాక్రమణదారులకు వ్యతిరేకంగా తమ దేశరక్షణ కొరకు ప్రయత్నించే పని ఉత్తర కొరియా చేస్తోంది. ఆ క్రమంలోనే అది ఒక పెద్ద సైనిక వ్యవస్థగా ఎదిగింది. అక్కడ సామాన్య ప్రజలు ఏ హక్కులు లేకుండా పేదరికంలో మగ్గుతున్నారనే ప్రచారం సామ్రాజ్యవాదులు చేయిస్తున్నారే తప్ప వాస్తవంలో ఉత్తర కొరియా ప్రజల జీవన ప్రమాణాలు చాలా మెరుగైనవి.

అన్నింటికంటే చివరిలో చెప్పుకున్నా తనకంటూ గొప్ప విప్లవ చరిత్ర కలిగిన సోషలిస్టు దేశం వియత్నాం. ఈ దేశాన్ని అమెరికా. ఆక్రమించుకొని తన సైనిక కేంద్రంగా చేసుకొని చుట్టూ ఉన్న దేశాల్ని శాసించాలని ప్రయత్నం చేసిన సందర్భంలో వియత్నాం వీరులు తమ దేశ విముక్తి కొరకు అమెరికా సైన్యంతో పోరాడారు. తమ దేశాన్ని అమెరికా కబంధహస్తాల నుండి విముక్తి చేయడంలో వారు చేసిన త్యాగాలు అసమాన్యమైనవి. ప్రపంచంలో ఏ దేశంలో వేయనన్ని బాంబులు ఈ దేశంపై అమెరికా ప్రయోగించింది. నివాసాలను పంట పొలాలను, నదీజ లాలను వేటినీ వదల కుండా ధ్వంసం చేసింది. అయినా వియత్నాం వీరుల విప్లవ దీక్ష ముందు అమెరికా సైన్యం నిలబడలేక తోకము డిచింది. విధ్వంసం నుండి తేరుకున్న అక్కడి కమ్యూనిస్టు ప్రభుత్వం దేశాభివృద్ధికై తీసుకున్న చర్యల ఫలితంగా నేడు వియత్నాం అభివృద్ధి చెందుతున్న దేశాల్లో ముందు పీఠీన ఉన్నది. తన ప్రజలందరికీ మౌలిక వసతుల కొరత లేకుండా చేయడమే కాకుండా ఈ నాడు ఒక ఆధునిక పారిశ్రా మిక దేశంగా అభివృద్ధి చెందుతోంది.

ప్రపంచగతిని మార్చ డంలో కీలకపాత్రను వహించిన సోవియట్ సోషలిస్టు ప్రభుత్వం అనేక కారణాల వల్ల 1991లో కూలిపోయింది. అయితే రష్యాలో సోషలిజం పతనం వల్ల అక్కడి ప్రజలకూ ప్రపంచ వ్యాప్తంగా పీడిత ప్రజలకు, కష్ట జీవులకు, కార్మికవర్గానికి కోలుకోలేని నష్టం జరిగింది. రష్యాలో సోషలిస్టు ప్రభుత్వం ఉన్నంత వరకు భారత దేశం రష్యాకు అత్యంత సన్నిహితమైన మిత్ర దేశంగా ఉండేది. రష్యాలో విప్లవం పతనమైన తర్వాత భారత పాలక వర్గాల ధోరణి మారిపో యింది. సామ్రాజ్యవాదుల కనుసన్నల్లో నడపబడే ప్రపంచీకరణ, సరళీకరణ ఆర్థిక విధానాలు మన ఆర్థిక వ్యవస్థను స్వాధీనం చేసుకు న్నాయి. "సంక్షేమ రాజ్యం" భావన క్రమంగా తొలగిపోయి దాని స్థానంలో కార్పొరేట్ శక్తులకు అనుగుణంగా విధానాలు రూపొందించబడ్డాయి. ప్రజల మౌలిక సమస్యలు నిర్లక్ష్యానికి గురిచేయ బడ్డాయి. కొద్ది మంది ధనవంతుల చేతిలో సంపద కేంద్రీకరణ పెరిగిపోయింది. ఉపాధి రహిత అభివృద్ధి వల్ల నిరుద్యోగం పెరిగింది. కాంగ్రెస్, బీజేపీలు ఈ విధానాలను భుజాన వేసుకున్నందువల్ల ఎవరు అధికారంలోకి వచ్చినా కార్పొరేట్ శక్తుల కనుసన్నల్లో పాలన నిర్వహించబడుతున్నది.

సర్వరోగ నివారిణిగా చెప్పబడ్డ ప్రపంచీకరణ అసలు రూపం అమెరికా ఆర్థిక సంక్షోభంతో తేలిపోయింది. పెట్టుబడి విధానంలోని అంతర్గత వైరుధ్యాల వల్ల ఆర్థిక సంక్షోభాలు అనివార్యమని మార్క్స్ మహాశయుడు చెప్పింది ఆచరణలో మనం చూస్తున్నాము. పెట్టుబడిదారీ దేశాల న్నింటిలో ఉద్యోగ, కార్మికుల హక్కులపై తీవ్రమైన దాడి జరుగుతుంది. మన దేశంలోని పాలకవర్గాలు పెట్టుబడిదార్ల తాబేదార్లుగా మారి వారికి రాయితీలు, ప్రజల భారాలు వేస్తున్నారు. రైతాంగం దివాళా తీయబడుతుంది. రైతుల ఆత్మహత్యలు పెరుగుతున్నాయి. కార్మిక చట్టాలు మార్చబడి కార్మికులను ఆధునిక బానిసలుగా మార్చేందుకు ప్రయత్నాలు జరుగుతున్నాయి. రాజ్యాంగం ఈరోజు నీరుగార్చబడుతోంది. ప్రజాస్వామ్యం బలహీనపడుతోంది. ప్రజల అసంతృప్తిని ప్రభుత్వమే మతోన్మాదం వైపు మళ్లించేందుకు ప్రయత్నిస్తోంది. మతం పేరిట ప్రజల్ని చీల్చే ప్రయత్నాలు తీవ్రమవు తున్నాయి. లౌకిక రాజ్యాంగం స్థానంలో మత రాజ్యం ఏర్పాటుకు ఆర్ఎస్ఎస్ ప్రయత్నిస్తోంది. గోరక్షణ పేరుతో మైనార్టీ మతాల ప్రజలపై దాడులు తీవ్రతరం అవుతున్నాయి.

ఈ నేపథ్యంలో వంద సంవత్సరాల కిందట కార్మికవర్గం సమైక్యంగా పోరాడి రాజ్యాధికారాన్ని సాధించిన రష్యా విప్లవం మనకు ఆదర్శంగా ఉండాలి. పీడనకు, దోపిడీకి వ్యతిరేకంగా ప్రజల్ని చైతన్యపర్చాలి. ప్రజావ్యతిరేక ఆర్థిక విధానాలపై పోరాటాన్ని తీవ్రతరం చేయాలి. ప్రజల చైతన్యాన్ని మరింత పెంచి తాత్కాలిక సమస్యలపై పోరాడటమేకాక మౌలికంగా సమాజాన్ని మార్చే పోరాటాల వైపుగా ఆకర్షించాలి. ఆరకమైన సైద్ధాంతిక చైతన్యం కార్మికవర్గంలో తీసుకురాగలగాలి. దోపిడీ వ్యవస్థ అంతమయినప్పుడే ప్రజలందరికీ సుఖప్రదమైన సమాజాన్ని నిర్మించుకోవచ్చు. రష్యా విప్లవం వెలుగులో భారతదేశంలో కార్మికరాజ్యాన్ని సాధించడమే లక్ష్యంగా వర్గపోరాటాలు పెంచడం మన కర్తవ్యం.

## అక్టోబర్ విప్లవ స్ఫూర్తితో...

**ఇన్సూరెన్స్ కార్పోరేషన్ ఎంప్లాయీస్ యూనియన్**
**విశాఖపట్టణం డివిజన్**

**ఇన్సూరెన్స్ కార్పోరేషన్ ఎంప్లాయీస్ యూనియన్**
**రాజమండ్రి డివిజన్**

**ఇన్సూరెన్స్ కార్పోరేషన్ ఎంప్లాయీస్ యూనియన్**
**మచిలీపట్నం డివిజన్**

**ఇన్సూరెన్స్ కార్పోరేషన్ ఎంప్లాయీస్ యూనియన్**
**నెల్లూరు డివిజన్**

**ఇన్సూరెన్స్ కార్పోరేషన్ ఎంప్లాయీస్ యూనియన్**
**కడప డివిజన్**

# మహిళా విముక్తికి మార్గదర్శి

- బృందాకరత్

స్త్రీ విముక్తి కేవలం సోషలిస్టు మార్గం ద్వారానే సాధ్యమని రష్యాలో సోషలిస్టు విప్లవం అనంతరం సోవియట్ యూనియన్ ఏర్పాటు ప్రపంచానికి అత్యద్భుతంగా



నిరూపించింది. ప్రపంచంలో మొట్టమొదటి సోషలిస్టు రాజ్యం రష్యాలో సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో లెనిన్ రూపొందించి అమలుపరచిన విధానాల వల్ల మహిళలు, పిల్లలు ఎంతగానో లబ్ధి పొందారు. జార్ ప్రభుత్వాన్ని కూలదోసే విప్లవోద్యమాల్లో, ఆ తర్వాత తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడంలో మహిళలు సమ భాగస్వాములుగా ఉన్నారు. లెనిన్ చెప్పినట్టు "మహిళలు సంపూర్ణ సేచ్ఛ పొందనంత వరకు శ్రామికవర్గం పూర్తిస్థాయి స్వేచ్ఛను పొందలేదు". సోవియట్ యూనియన్ మహిళలు దానికి దగ్గరగా వెళ్లారు. అక్టోబర్ విప్లవం శతవార్షిక ఉత్సవాలు జరుపుకుంటున్న నేపథ్యంలో మహిళా విముక్తి కోసం చేసిన బహుముఖ పోరాటంలో సోవియట్ అనుభవం, సాధించిన విజయాలకు సంబంధించిన నాలుగు అంశాలను పరిశీలిద్దాం. అవి 1. న్యాయ చట్టాలు, 2. భౌతిక మార్పులు, సామాజిక ఉత్పత్తిలో మహిళల పాత్ర, స్త్రీ, పురుష శ్రమ విభజనకై చేపట్టిన చర్యలు, 3. కుటుంబం, కుటుంబ నియమావళి, 4. పార్టీలో మహిళల పాత్ర, పార్టీ పాత్ర.

**అసమాన చట్టాల తొలగింపు**

విప్లవం వచ్చిన తొలి ఆరు మాసాల్లో ఉన్న చట్టాలన్నింటినీ రద్దు చేసి మహిళల కోసం స్త్రీ, పురుష వివక్షకు తావులేని చట్టాలను సోవియట్ ప్రభుత్వం తీసుకొచ్చింది. భూస్వామ్య విధానాన్ని రద్దు చేసి భూమిని పేద రైతులకు పంపిణీ చేసేందుకు వీలుగా మొట్టమొదటి ఉత్తర్వులను తీసుకొచ్చింది. లెనిన్ సంతకం చేసిన ఈ ఉత్తర్వు మహిళా రైతులకు కూడా భూమి మీద సమాన హక్కులు కల్పించింది. ఇదేం చిన్న విజయం కాదు. అక్టోబర్ విప్లవానంతరం (నేటి క్యాలెండర్ ప్రకారం నవంబర్ 7న విప్లవం జరిగింది) నవంబర్ 11వ తేదీన 8 గంటల పనిదినాన్ని ప్రవేశపెట్టే ఉత్తర్వును జారీ చేసింది. మహిళలు రాత్రిపూట పని చేయడాన్ని నిషేధించిన ఈ ఉత్తర్వు ఆ కాలంలో వారికి గొప్ప ఉపశమనాన్ని కలిగించింది. నవంబర్ 14న చేసిన సామాజిక భద్రతా చట్టాలు శ్రామిక మహిళలందరికీ కనీసం 16 వారాల ప్రసూతి సెలవు కల్పించాయి. సోవియట్ ప్రభుత్వం ప్రపంచంలోకెల్లా తొలిసారిగా మహిళలకు రుతు సమయంలో ఐచ్ఛిక సెలవు సదుపాయాన్ని అందించింది. 1918లో ప్రసూతి సదుపాయాలను మరింత విస్తృతం చేస్తూ బిడ్డలకు పాలిచ్చేందుకు వీలుగా తల్లులకు మూడు గంటలకోసారి కొంత విరామ సమయాన్ని కేటాయించింది. మహిళలకు సమాన వేతనాన్ని కల్పించేలా కనీస వేతన ఉత్తర్వును తీసుకొచ్చింది. భూమి, పనికి సంబంధించి మహిళలకు చట్ట సౌకర్యం కల్పించిన దేశం సోవియట్ యూనియన్. అనేక దశాబ్దాల తర్వాత సోవియట్ స్ఫూర్తితో పెట్టుబడిదారీ దేశాల్లో ప్రజలు ప్రభుత్వాలపై వర్గ పోరాటాల ద్వారా ఒత్తిడి తేవడంతో అనివార్యంగా ఆ విధమైన చట్టాలు చేయాల్సి వచ్చింది.

సోషలిస్టు ప్రభుత్వం 1918లో తొలి రాజ్యాంగాన్ని స్వీకరించింది. విద్య, ఆస్తి సంబంధ అంశాల ప్రమేయం లేకుండా మహిళలకు పురుషులతో సమానంగా ఓటు హక్కు కల్పించారు. అమెరికాలో మహిళలకు ఓటు హక్కు 1920లోగానీ లభించలేదు. నిర్బంధ విద్యావ్యాప్తికై సోషలిస్టు ప్రభుత్వం ఓ ఉత్తర్వును జారీ చేసింది. భారత్‌లో అక్షరాస్యతా కార్యక్రమం చేపట్టిన 'ప్రతి ఒక్కరం ఇంకొక్కరికి బోధిద్దాం' నినాదాన్ని సోషలిస్టు రష్యా 1919 డిసెంబర్‌లోనే చట్టంగా తీసుకొచ్చింది. ఆ తర్వాత ఇరవైఏళ్లకు రష్యాలో మహిళా నిరక్షరాస్యత దాదాపుగా కనుమరుగైంది. ఇవన్నీ కుటుంబ చట్ట పరిధిలో తీసుకున్న విప్లవాత్మక చర్యల్లో భాగంగా చేపట్టినవే. కుటుంబంలో నెలకొన్న పురుషాధిపత్యాన్ని, పాశ్చాత్య స్త్రీ వాదులు సవాల్ చేయడానికి కొన్ని దశాబ్దాల ముందే తొలి సోషలిస్టు ప్రభుత్వం పితృస్వామిక చట్టాలు, కుటుంబ కట్టుబాట్లను రద్దు చేసింది. ఈ విజయాలను సమీక్ష చేసే సందర్భంలో లెనిన్ ఇలా అన్నారు. "మేం అధికారంలోకి వచ్చిన తొలి ఏడాది కాలంలో వందో వంతు కూడా ప్రపంచంలోని ఏ ఒక్క ప్రజాతంత్ర పార్టీగానీ, ఎంతగానో పురోగమించిన బూర్జువా రిపబ్లిక్కులుగానీ చేయలేక

# లక్ష్యాల సాధనలో ఏ.పి.ఎస్.ఆర్.టి.సి... విజయాలు




## ప్రయాణీకులకు మెరుగైన సేవలందిస్తూ సాగిస్తున్న ప్రస్థానంలో....
## ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థ సాధించిన లక్ష్యాలెన్నో.... అందులో కొన్ని...



- రోజువారీ సగటు రాబడి రూ.12 కోట్ల నుండి రూ. 13 కోట్ల స్థాయికి పెరుగుదల
- ప్రయాణీకుల ఆక్యుపెన్సీ రేషియో (O.R) 66% నుండి 74%కు పెరుగుదల
- విమాన ప్రయాణాన్ని తలపించే అత్యాధునిక "అమరావతి" బ్రాండ్ (45 స్కానియా / వోల్వో బస్సులు) అధునాతనమైన 25 గరుడ ప్లస్ బస్సులు రాష్ట్రంలోని ప్రధాన ప్రాంతాలకు ఏర్పాటు
- ఉద్యోగస్తులు, వారి కుటుంబ సభ్యులకు అత్యాధునిక ఆసుపత్రి విద్యాధరపురంలో ప్రారంభించబడింది
- విద్యార్థులకు 5 లక్షల ఉచిత బస్సు పాస్‌లు జారీ



- 6 లక్షల విద్యార్థులకు రాయితీ బస్సు పాసులు, వికలాంగులకు ఉచిత బస్సు పాసుల జారీ
- సీనియర్ సిటిజన్లకు బస్సు ఛార్జీలలో (ఏ.సి.బస్సులతో సహా) 25% రాయితీ
- సరసమైన ఛార్జీలతో సరికొత్త రకం అల్ట్రా డీలక్స్ బస్సులు 630 ప్రవేశపెట్టబడినవి
- తెలుగు వెలుగు బస్సుల శ్రేణిలో నూతనంగా అల్ట్రా తెలుగు-వెలుగు బస్సులు ప్రవేశపెట్టబడినది



- ఏసి ఎకానమీ బస్సు సర్వీసు సగం సీట్లు ఏసి, సగం సీట్లు నాన్-ఏసి సూపర్ లగ్జరీ సర్వీసులు నూతనంగా ప్రవేశపెట్టబడినది.
- తిరుపతి, ఒంగోలు, గుంటూరు, అనంతపురంలలో నూతనంగా సిటీ బస్సులు ప్రారంభం
- లాజిస్టిక్స్ మరియు పార్సిల్ సర్వీసులను నూతనంగా ఏర్పాటు చేయడమైనది
- సిటీ బస్సులు, దూర ప్రాంత బస్సులలో వెహికల్ ట్రాకింగ్ సిస్టం ద్వారా బస్ స్టేషన్లలో అత్యాధునిక సమాచార వ్యవస్థ
- అడ్వాన్స్ రిజర్వేషన్ సిస్టం ఆధునీకరణ, మొబైల్ యాప్ మరియు ఈ-వ్యాలెట్ సౌకర్యం ఏర్పాటు
- మొత్తం 13 జిల్లాల్లో బస్సు పాసుల జారీ ప్రక్రియ-పూర్తి స్థాయిలో కంప్యూటరీకరణ
- ప్రతి ఒక్క ఉద్యోగికి సామూహిక భీమా పథకం అమలు ద్వారా రూ.10 లక్షల ప్రమాద భీమా సౌకర్యం ఏర్పాటు
- సర్వీసులో ఉండగా చనిపోయిన ఉద్యోగుల పిల్లలకు కారుణ్య నియామకాలు
- ప్రభుత్వ ఉద్యోగులతో సమానంగా సంస్థ ఉద్యోగులకు జీతభత్యాలలో పెరుగుదల

**డా.ఎం.మాలకొండయ్య, ఐపిఎస్**
వైస్ ఛైర్మన్ అండ్ మేనేజింగ్ డైరెక్టర్

26 (B)

**ఏ.పి.ఎస్.ఆర్.టి.సి.బస్సులలో ప్రయాణించండి - సురక్షితంగా గమ్యానికి చేరండి**

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సహకార బ్యాంక్

## (APCOB)

### రాష్ట్ర రైతాంగం సేవలో...

### మనరాష్ట్రం
### మన బ్యాంక్



**శ్రీ పిన్నమనేని వెంకటేశ్వరరావు గారు**
మాజీమంత్రి
అధ్యక్షులు, ఆప్కాబ్

---

- స్థిరాస్థి హామీపై ఋణ పరిమితి -SOD
- గృహ ఋణ పథకాలు @9.30%
- వ్యక్తిగత ఋణాలు
- వాహన కొనుగోలు ఋణాలు
- బంగారు నగలపై ఋణాలు
- డిపాజిట్లపై ఆకర్షణీయ వడ్డీలు
- మొబైల్ బ్యాంకింగ్
- రూపే డెబిట్ కార్డు సౌకర్యం
- IMPS / RTGS / NEFT సౌకర్యం
- CTS చెక్ క్లియరెన్స్
- ATM సౌకర్యం
- లాకర్ల సదుపాయం

పోయాయి. మహిళలకు పురుషులతో సమాన స్థానం కల్పించని హేయమైన చట్టాలను నిజంగా నేలమట్టం చేశాం.” న్యాయమైన సమానమైన చట్టాల రూప కల్పన దిశగా వేసిన అతి పెద్ద అంగ ఇది.

**కుటుంబ నియమావళి**

మహిళల పట్ల వివక్షను కనబరిచే అన్ని రకాల పాత చట్టాలు విప్లవంలో కొట్టుకుపోయాయి. వాటి స్థానంలో మహిళలకు సమాన హక్కులనిచ్చే చట్టాలు (వివాదం, విడాకులు, శిశుసంరక్షణ, భరణం, ఆస్తిలో సమాన వాటా వంటి అంశాలు) వచ్చి చేరాయి. సక్రమ, అక్రమ సంతానం మధ్య భేదాన్ని తొలగించడమే కాక చిన్నారుల సంరక్షణ బాధ్యతను ప్రభుత్వమే స్వీకరించింది. అయితే 18 సంవత్సరాల వయసు వచ్చే వరకు తల్లిదండ్రుల సంరక్షణ పొందే చట్టబద్ధమైన హక్కు వారికి ఉంటుంది. గర్భస్రావం చేయించుకునే హక్కు మహిళలకు కల్పించింది. స్వలింగ సంపర్కం ఇతరత్రా ఏకాభిప్రాయ లైంగిక కార్యకలాపాలకు వ్యతిరేకంగా ఉన్న చట్టాలను అది రద్దు చేసింది. ఈ విషయాలపై సోషలిస్టు ప్రభుత్వం 1923 అధికారిక కరపత్రంలో తన అభిప్రాయాన్ని వ్యక్తం చేసింది. “ఏ ఒక్కరూ గాయపడనంత వరకు, ఏ ఒక్కరి హక్కులకు భంగం వాటిల్లనంత వరకు, ప్రభుత్వంగానీ, సమాజంగానీ లైంగిక సంబంధ అంశాల్లో జోక్యం చేసుకోవని సోవియట్ చట్టం ప్రకటించింది’. వ్యభిచారం చట్ట వ్యతిరేకమైందని ప్రకటించక పోయినప్పటికీ దానిని బాగా నిరుత్సాహపరచింది. ఆ వృత్తిలో ఉన్న వారిని ఉత్పాదక శ్రమ వైపు మళ్లించే ప్రయత్నం చేసింది.

పితృస్వామిక కుటుంబాన్ని రద్దు చేయాలని తొలితరం బోల్షివిక్కులు భావించారు. మొదట ఏర్పాటు చేసిన కుటుంబ నియమాలు వీటినే ప్రతిబింబించాయి. శతాబ్దాల కాలం నాటి సంప్రదాయాలను రద్దు చేసేందుకు ప్రభుత్వం ప్రయత్నించింది. వాటి స్థానంలో సమ విలువలు కలిగిన చట్టాన్ని ప్రవేశపెట్టింది. గృహహింసకు పాల్పడిన వారిపై కఠిన చర్యలు తీసుకునేది. పైగా ఈ విషయమై సమాజంలోనూ అసమ్మతి ఉండేది. పెట్టుబడిదారీ దేశాల్లో జీవిత భాగస్వాముల నుంచి భయానక హింస ఎదురయ్యేది. వీటితో పోలిస్తే సోషలిస్టు రష్యాలో కొంత మెరుగనుకోవాలి. అయితే విడాకుల చట్టాల సరళీకరణ, వివాహాల నమోదు తొలగింపును పురుషులు అవకాశంగా తీసుకునేవారు. స్వల్పకాలపు బంధాల వల్ల మహిళలు లైంగిక దోపిడీకి గురై ఒక్కోసారి పసిబిడ్డలతో సహా వీధినపడడం సర్వసాధారణంగా కనిపించింది.

దాంతో సోవియట్ ప్రభుత్వం కుటుంబ నియమావళిని సవరించి వివాహ నమోదును తప్పనిసరి చేయడమేగాక విడాకుల వేళ భరణం ఇవ్వాలంది. ఈ మార్పులతో అవకాశవాద పురుషులను కట్టడి చేసే వీలు కలిగింది. కుటుంబం, వ్యక్తుల మధ్య

## అసమాన శ్రమ విభజన

మార్క్సిస్టు సిద్ధాంతం ప్రకారం మహిళా విముక్తి స్త్రీ, పురుష శ్రమ (ఉత్పత్తి, పునరుత్పత్తిలో) విభజన మీద ఆధారపడి ఉంటుంది. సామాజికోత్పత్తిలో మహిళలకు పురుషులతో సమానమైన స్థానం కల్పించాలి. ప్రధాన ఉత్పత్తి విభాగంగా కుటుంబాన్ని తొలగించాలి. పునరుత్పత్తికి సంబంధించిన బహుముఖ బాధ్యతలను స్త్రీ, పురుషులు పంచుకోవడమేకాక ఇంటిపనుల నుంచి మహిళలను విముక్తులను చేయాలి. లెనిన్ చెప్పినట్టు ‘అన్ని చట్టాలున్నప్పటికీ.. ఎప్పుడైతే, ఎక్కడైతే అల్పమైన ఇంటిపనికి వ్యతిరేకంగా పూర్తిస్థాయి పోరాటం మొదలవుతుందో అప్పుడే మహిళలకు నిజమైన విముక్తి సాధ్యమవుతుంది.’ ఉత్పత్తి సాధనాలపై ప్రభుత్వ యాజమాన్యం అవసరం. ప్రణాళికాబద్ధమైన ఆర్థిక వ్యవస్థకు ఇది శక్తినిస్తుంది. లాభాలే పరమావధిగాగల పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ ఈ అంశాన్ని ఎన్నడూ ప్రస్తావించలేదు. తొలి కార్మిక రాజ్యమైన సోవియట్ మొదటిసారిగా అందుకు కృషి సల్పింది.

సోషలిస్టు ప్రభుత్వం మహిళల కోసం, వారి నైపుణ్యాలను వృద్ధి చేయడం కోసం వృత్తి పాఠశాలలు, ఫ్యాక్టరీలు, కార్యాలయాల్లో శిక్షణ తరగతులు నిర్వహించింది. ఉపాధిలో మహిళల సంఖ్య పెరిగేవేళ వారికి పూర్తిస్థాయిలో ప్రాథమిక సదుపాయాలను కల్పించింది. శ్రామిక మహిళ మీద పడే రెండు రకాల పని భారాలను తొలగించేందుకే ఈ ఏర్పాటు. శిశు సంరక్షణ కేంద్రాలు, క్యాంటీన్లు, లాండ్రీలు, పలు స్థానిక సౌకర్యాలను పెద్ద ఎత్తున ప్రారంభించింది. అద్భుతమైన ఫలితాలు వచ్చాయి. మరుసటి దశాబ్దం నాటికి కోట్లాది మంది మహిళలు సంప్రదాయ కట్టుబాట్లను బద్దలుకొట్టుకొని పురుషులతో సమానంగా ఉపాధిని సంపాదించుకున్నారు. ఇంటికి సంబంధించిన భారాలు తగ్గాయి. వాస్తవానికి సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ పున:నిర్మాణంలో మహిళలు కీలకపాత్ర వహించారు. రెండో ప్రపంచ యుద్ధం నాటికి పట్టభద్రుల్లో 36 శాతం మహిళలే. విద్య, వైద్య రంగాల్లో వారు ప్రధాన శ్రమశక్తిగా మారారు. ఆ తర్వాత ఇంజినీర్లు, వైద్యులు, శాస్త్రవేత్తల్లో సగభాగం వారే. గ్రామీణ ప్రాంతాల్లో సమష్టి వ్యవసాయ క్షేత్రాలు ఏర్పడ్డాయి. ఇందులో మహిళలకు పెద్ద ఎత్తున అంటే సుమారుగా 2 కోట్ల మందికి ఉపాధి లభించింది. ఈ క్షేత్రాలకు వేలాది మంది మహిళలు నాయకత్వం వహించారు. విప్లవం వచ్చిన కొద్ది దశాబ్దాల అనంతరం ప్రతి రంగంలోనూ, ప్రతి పనిలోనూ జరిగిన కృషిలో పురుషులతో సమానంగా మహిళలు స్థానాన్ని సంపాదించుకున్నారు. ప్రపంచ చరిత్రలోనే ఇది ప్రప్రథమం.

సంబంధాలపై విస్తృతంగా జరిగిన చర్చలపై ఈ మార్పు ప్రభావం కనిపించింది. అయితే పితృస్వామిక భావజాలం తిరిగి బుసలు కొట్టడం చూస్తాం. అదే విధంగా భౌతిక పరిస్థితుల్లో వచ్చిన మార్పు పురుష జాత్యహంకార సిద్ధాం తాలను ఓటమిపాలు చేస్తుం దనుకున్న భ్రమలను ఇది పటాపంచలు చేసింది. ఆ తర్వాతి కాలంలో కామ్రేడ్ స్టాలిన్ నాయత్వంలో మహిళలు బ్రహ్మాండమైన ఆర్థిక ప్రగతిని సాధించారు. అయితే అప్పుడు భిన్నమైన సవాళ్లు ఎదురయ్యాయి. నియంతృత్వానికి వ్యతిరేకంగా సోవియట్ యూనియన్ సంరక్షణకై సాగిన దేశభక్తయుత పోరులో ఆ దేశ మహిళలు మరోసారి ముందు పీఠిన నిలిచారు. స్టాలిన్ స్ఫూర్తితో చేసిన సాహసోపేత పోరాటంలో వారు వీరోచిత పాత్ర పోషించారు. అయితే ఈ కాలంలో మరీ ముఖ్యంగా రెండో ప్రపంచ యుద్ధం వల్ల ధ్వంసమైన దేశాన్ని పునర్నిర్మించడంలో కుటుంబ పాత్రను గమనించాలి. తొలితరం బోల్షివిక్ విప్లవ కారులు దేన్నైతే వ్యతిరేకించారో అలా తల్లి పాత్రను తిరిగి నిర్దేశించారు. ముందు తరాలను పెంచి పోషించడం వంటి సంప్రదాయ బాధ్యతలను ఆమెకు అప్పగించారు. గర్భస్రావం చేయించుకునే హక్కు తలకిందులైంది. (1955లో తిరిగి తీసుకొచ్చారు). కుటుంబంలో మహిళల పాత్రను తిరిగి ప్రవేశపెట్టారు. మహిళలు, చిన్నారుల సంరక్షణ కోసం ప్రవేశపెట్టిన చట్టంతోపాటు యుద్ధానంతర కాలంలో చేపట్టిన అనేకానేక అంశాల్లో పరాజయం ప్రారంభమైంది. 'కుటుంబ నిర్మాణాలు, స్త్రీ పురుషుల మధ్య వ్యక్తిగత సంబంధాలు సవాళ్లను ఎదుర్కొంటూనే ఉంటాయి. మారుతుంటాయి' అని ఏడు దశాబ్దాల సోషలిస్టు అనుభవం నిరూపించిందన్న విషయాన్ని సోవియట్ తీవ్ర విమర్శకులు సైతం అంగీకరించాల్సిందే.




**ముగింపు**

రష్యా విప్లవం శత జయంతిని జరుపుకుంటున్న వేళ.. రష్యాతో సహా పూర్వ సోషలిస్టు దేశాల్లో మహిళల హోదాను పెట్టుబడిదారీ ప్రతీఘాత విప్లవం దెబ్బతీసింది. పాత అసమానతలన్నీ అక్కడ తిరిగి తిష్టవేశాయి. మహిళలు అత్యంత దుర్భర పరిస్థితుల్లో ఉన్నట్లు తాజా గణాంకాలు తెలియజేస్తున్నాయి. సోవియట్ యూనియన్ 75 ఏళ్ల చరిత్రలో మహిళా విముక్తి కోసం చేసిన పోరాటంలో ఎన్నో ఎత్తుపల్లాలు, గొప్ప విజయాలు, వైఫల్యాలు ఉన్నాయి. అయితే మహిళల సామాజిక విముక్తి ఒక్క సోషలిజంలోనే సాధ్యమని ఇన్నేళ్లలో విస్పష్టంగా నిరూపితమైంది.

**(18వ పేజీ తరువాయి)**

పెట్టుబడిదారీ, సామ్రాజ్యవాద వ్యవస్థకు ప్రత్యామ్నాయాన్ని స్థాపించి సవాలు విసిరింది.

అయితే 1917 అక్టోబర్ విప్లవం అకస్మాత్తుగా విజయం సాధించలేదు. కార్మికవర్గం అనేక జయాపజయాల తర్వాత సాధించిన విజయం అది. 1848లో యూరోప్‌లో జరిగిన విప్లవాలలో కార్మికవర్గం బూర్జువావర్గ అనుయాయులుగా పాల్గొన్నారు. 1871లో పారిస్ కమ్యూన్‌లో కార్మికవర్గం ఒక స్వతంత్ర శక్తిగా విప్లవానికి నాయకత్వం వహించింది. 30 రోజులపాటు పారిస్ నగరాన్ని శ్రామికుల రాజ్యం పాలించింది. కానీ రైతాంగాన్ని కూడగట్టుకోలేక పోవడంతో ఓటమిపాలయింది. రక్తపుటేరుల్లో ముంచి బూర్జువా, ఫ్యూడల్‌వర్గాలు పారిస్ కమ్యూన్‌ను ఓడించారు. ఈ అనుభవాల నుండి నేర్చుకున్న గుణపాఠాలతో 1917 అక్టోబర్ విప్లవాన్ని అసమాన త్యాగాలతో కార్మికవర్గం జయప్రదం చేసింది.

అక్టోబర్ విప్లవం 74 ఏళ్ళపాటు అప్రతిహతంగా పెట్టుబడిదారీ వ్యవస్థకు ప్రత్యామ్నాయంగా కార్మికవర్గ రాజకీయ శక్తికి ప్రతినిధిగా నిలిచింది. అనేక విజయాలను సాధించింది. అయినా మార్క్సిజం, సోషలిజం సిద్ధాంతాలతో సంబంధంలేని కారణంగా 1991లో రష్యాలో, మరికొన్ని దేశాలలో సోషలిజం ధ్వంసం అయింది. పెట్టుబడిదారీ విధానం పునరుద్ధరణ అయింది. మరల ఒక వ్యవస్థగా పెట్టుబడిదారీ సమాజాన్ని ధ్వంసం చేసి సమసమాజ స్థాపన కర్తవ్యం తిరిగి కార్మికవర్గం ముందుకు వచ్చింది. రష్యా తదితర దేశాలలో సోషలిస్టు వ్యవస్థలు సాశనం అయినంత మాత్రాన అవి ప్రపంచం ముందుంచిన ప్రత్యామ్నాయ విధానాల గొప్పతనం, అవసరం తరిగిపోలేదు. ప్రస్తుత పెట్టుబడిదారీ విధాన సంక్షోభం అటువంటి ప్రత్యామ్నాయం యొక్క అవసరాన్ని మరింత నొక్కి చెపుతున్నది. అనుభవాల నుండి నేర్చుకుని మరింత పట్టుదలతో కార్మికవర్గ శక్తులు సోషలిజం స్థాపించే రాజకీయ పోరాటాన్ని కొనసాగిస్తాయనే దాంట్లో సందేహం లేదు. 'భవిష్యత్తు కార్మికవర్గానిదే' అన్న మార్క్స్ మాటలు తొందరలోనే నిజమవుతాయి.

# STEEL PLANT CONTRACT LABOUR UNION

Regd.No.519/80 (Affiliated to CITU & SWFI)

Sector -2, Ukkunagaram, Visakhapatnam - 530 032. Email: spclucitu@gmail.com

## అక్టోబర్ విప్లవం స్ఫూర్తితో పోరాడదాం
## స్టీల్ ప్లాంట్‌ను కాపాడుకుందాం
## గనులు సాధించుకుందాం
## కార్మిక హక్కులను రక్షించుకుందాం

| Hon,ble President | President | Genaral Secretary |
|---|---|---|
| **PVSBS RAJU** | **D.PANDAY** | **P.SATYA RAO** |
| 9396657585 | 9399921410 | 9347211040 |
| srinivasuraju530@gmail.com | dpanday@gmail.com | 9618707083 |

## స్టీల్ ప్లాంట్ కాంట్రాక్ట్ లేబర్ యూనియన్
### విశాఖపట్నం స్టీల్ ప్లాంట్

కార్మికవర్గ, శ్రామిక ప్రజల మూల్గులను పీలుస్తున్న దోపిడీ వ్యవస్థను నిర్మూలిద్దాం
కార్మికరాజ్యం సాధనకై అంకితమౌదాం
కార్మికలోకం యాజమాన్యానికి, సిబ్బందికి, పాఠకులకు
సోవియట్ యూనియన్. అక్టోబర్ విప్లవ శుభాకాంక్షలతో

## స్టీల్ ప్లాంట్ కాంట్రాక్టు లేబర్ యూనియన్ (సిఐటియు)
రిజిస్ట్రేషన్ నెం.డి 519/80
గ్రేటర్ విశాఖపట్నం

## జివిఎంసి కాంట్రాక్టు వర్కర్స్ యూనియన్ (సిఐటియు)
రిజిస్ట్రేషన్ నెం 1877/2001
గ్రేటర్ విశాఖపట్నం

## జివిఎంసి ఎంప్లాయీస్ యూనియన్ (సిఐటియు)
రిజిస్ట్రేషన్ నెం 1079/89
గ్రేటర్ విశాఖపట్నం

# రష్యన్ శ్రామిక వర్గ సారథ్యంలో అక్టోబరు విప్లవం

- తెలకపల్లి రవి

విప్లవం అంటే సమూలమైన మార్పు. మానవ జాతి మాట్లాడే భాషలన్నింటిలో ఉన్న అన్ని పదాలకంటే గొప్ప అర్థం ఇచ్చే మాట విప్లవం. విప్లవం, విప్లవకారులు, విప్లవాత్మకం వంటి మాటలు సర్వసాధారణంగా వినిపిస్తూనే ఉంటాయి. ఆఖరికి వ్యాపార ప్రకటనలు, వగైరాల్లో కూడా ఈ మాట ఉపయోగిస్తుంటారు. విప్లవకారులు అంటే తుపాకి పట్టుకొని ఆలీవ్‌గ్రీన్ యూనిఫాంలో రాంబోల్లా సంచరిస్తుం టారనే ఇమేజ్ మీడియా ఇస్తుంటుంది. వ్యక్తిగత జీవితంలోగానీ సామాజికంగా గానీ ఎదురు దెబ్బలు తిన్నప్పుడు నిరాశా నిస్పృహలకు గురైనప్పుడు విప్లవకారులుగా మారిపోతారన్నట్టు చాలా మంది మాట్లాడు తుంటారు. గాంధేయ విప్లవమని, ఇస్లామిక్ విప్లవమని, హైందవ విప్లవమని రకరకాల ప్రయోగాలు చేస్తుంటారు. నిజమైన అర్థంలో సమాజ పురోగమనానికి మానవ విముక్తికి దోహదం చేసేది మాత్రమే విప్లవం అవు తుంది.

మానవ చరిత్రను శాస్త్రీయంగా అధ్యయనం చేసి దాన్ని మార్చేందుకు మార్గం చూపింది మార్క్స్-ఎంగెల్స్‌లు. అసంఖ్యాకులు దోపిడీకి, పీడనకు గురవుతుండగా అతి కొద్దిమంది వారి శ్రమ ఫలితాన్ని కబళిస్తున్నారని, ఈ అశేష ప్రజానీకం శ్రామిక వర్గం నాయకత్వాన దోపిడీని కూలదోయడమే విప్లవమని వారు ఎలుగెత్తి చాటారు. అంతకుముందు కూడా విప్లవాలు రాకపోలేదు. ఉదాహరణకు అమెరికన్ విప్లవం, ఇంగ్లండ్ పారిశ్రామిక విప్లవం, ఫ్రెంచి విప్లవం చరిత్ర ప్రసిద్ధికెక్కాయి. ఇవి నాటి పరిస్థితుల్లో గొప్ప మార్పు తెచ్చాయి. కానీ ఇవి బూర్జువా విప్లవాలు. వీటి కారణంగా రాజకీయ, సామాజిక వ్యవస్థలు మారినప్పటికీ దోపిడీ మాత్రం ఆగలేదు. రాజ్యాధికారం ఒక దోపిడీ వర్గం చేతిలోంచి ఇంకో దోపిడీ వర్గం చేతిలోకి వచ్చింది. అసలు దోపిడీని తుద ముట్టించే విప్లవం మాత్రమే నిజమైన విముక్తి చూపుతుందని మార్క్స్-ఎంగెల్స్‌లు విశ్లేషించారు. వారి బోధనలను లెనిన్ మరింత పటిష్టపరిచి అక్టోబర్ విప్లవం విజయవంతం చేశారు.



మార్క్సు, ఎంగెల్సు చెప్పినట్టు అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాల్లో గాక వెనకబడిన రష్యాలో మొదట విప్లవం వచ్చిందని మార్క్సిజం వ్యతిరేకులు వారు ఎప్పుడూ అదేపనిగా వ్యాఖ్యానిస్తూనే ఉంటారు.. 1877లోనే మార్క్సు సోర్జ్‌కు రాసిన ఉత్తరంలో రష్యా తిరుగుబాటుకు సమీపంలో ఉందన్నారు. 1889లో ఎంగెల్సు కూడా అలాంటి అభిప్రాయాలే వెలిబుచ్చారు.

విప్లవానికి ముందు రష్యాలో పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి అయింది. పారిశ్రామిక రంగంలో బ్రిటన్, ఫ్రాన్స్, జర్మనీ, అమెరికాల తర్వాత స్థానం దానిదే. దేశంలో గుత్తపెట్టుబడిదారీ వర్గం కూడా పెరిగి ఉంది. 200 గుత్త సంస్థల చేతుల్లోనే పరిశ్రమలు కేంద్రీకృతమై ఉన్నాయి. 52 శాతం మేరకు విదేశీ పెట్టుబడులు కూడా ఉండటం విశేషం. జనాభాలో 20 శాతం కార్మిక వర్గం. (1917 నాటికి ఈ సంఖ్య రెండు కోట్లు). వారి పరిస్థితులు అత్యంత దుర్భరంగా ఉండేవి. గ్రామీణ ప్రాంతాల్లో భూస్వామ్య అర్ధ భూస్వామ్య వ్యవస్థ క్షీణ దశలో ఉంది. రైతులను అత్యంత దారుణంగా దోచుకునేవారు. వెట్టి చాకిరీ చాలా తీవ్రంగా ఉండేది. మొత్తం పైన పారిశ్రామిక కార్మికులు, గ్రామీణ పేదలు కలసి దేశ జనాభాలో 64 శాతం ఉన్నారు. ఇంకో వైపున జాతుల బందిఖానాగా రష్యా ఉంది. రష్యనేతర జాతుల ప్రజలపై తీవ్ర నిర్బంధ విధానం సాగుతున్నది.

జార్ నిరంకుశ పాలనలో ప్రజలకు ఏ హక్కులూ లేవు. ఏ మాత్రం అసమ్మతి కనిపించినా పోలీసులు వేటాడేవారు.. ఇందుకు వ్యతిరేకంగా కమ్యూనిస్టులు లెనిన్ నాయకత్వాన చిన్న చిన్న బృందాలుగా సమీకృతమవుతున్నారు. కార్మిక వర్గం సంఘాలలో సమరశీలత సంతరించుకుంటున్నది. కానీ జన బాహుళ్యంలో మాత్రం ఇంకా పెద్ద కదలిక రాలేదు. జార్ చక్రవర్తిపై భ్రమలూ పోలేదు. ఆయనే తమ పాలిట ఆపద్బాంధవుడని చాలా మంది నమ్ముతున్నారు.

19 వ శతాబ్దం చివరి కాలంలో పసిఫిక్ సముద్రంపై ఆధిపత్యం పెంచుకోవడానికి సామ్రాజ్యవాదులు యుద్ధాలు ప్రారంభించారు. అనలే అంతంత మాత్రమైన ఆర్థిక పరిస్థితుల్లో ఉన్న రష్యా కూడా ఆ యుద్ధంలో దిగింది. రష్యాకు జపాన్‌కు మధ్య యుద్ధం ప్రజ్వరిల్లింది. ఫలితంగా ప్రజల స్థితిగతులు మరింత దిగజారాయి. యుద్ధంలో ఓటమి జార్ చక్రవర్తి పతనానికి నాంది అని లెనిన్ సూత్రీకరించారు. కార్మికులపై పీడన, దోపిడీ మరింత తీవ్రమయ్యాయి. 1904 డిసెంబరులో బకూలో కార్మికవర్గం పెద్ద ఎత్తున సమ్మె పోరాటం చేసింది. చాలా పెద్ద సమ్మె. నూనె గనుల యజమానుల నుంచి కార్మిక సంఘాలు చాలా రాయితీలు సాధించాయి. 1905 జనవరి 3వ తేదీన సెంట్ పీటర్స్‌బర్గ్ పరిశ్రమలో కల్లా పెద్దదైన ప్యూటిలావ్ పరిశ్రమలో సమ్మె ప్రారంభమ

యింది. కారణం నలుగురు కార్మికులను బర్తరఫ్ చేయడం. ఈ సమ్మె త్వరలోనే విస్తృతమైంది. సెంట్ పీటర్స్‌బర్గ్‌లోని ఇతర మిల్లుల, ఫ్యాక్టరీల కార్మికులు కూడా సమ్మెలో చేరారు.

వ్యూటిలావ్ సమ్మెకు పూర్వం పోలీసులు గేవన్ అనే మతాధిపతిని గూఢ చారిగా ఉపయోగించుకొన్నారు. తత్ఫలి తంగా 'రష్యన్ ఫ్యాక్టరీ కార్మికుల సంఘం' అనే ఒక సంఘాన్ని గేవన్ నెలకొల్పాడు. సమ్మె ప్రారంభంకాగానే, గేవన్ ఒక విద్రోహకరమైన పథకాన్ని తన సంఘాల్లో సూచించాడు. జనవరి 9వ తేదీన కార్మికులందరూ కూడి చర్చి జండాలను జార్ చక్రవర్తి చిత్రపటాలను పట్టుకొని శాంతియుతంగా వింటర్ రాజభవనం వద్దకు ఊరేగింపు చేసుకుంటూ వెళ్లి దరఖాస్తు ఇవ్వాలన్నాడు.

జార్‌కు దరఖాస్తులు పెట్టుకొనడం ద్వారా కార్మికులకు స్వతంత్రం రాదనీ, సాయుధపోరాటం ద్వారానే స్వాతంత్ర్యాన్ని సంపాదించుకోవాలనీ బోల్షివిక్కులు విశదీ కరించి చెప్పారు. కార్మికులపై కాల్పులు కూడా జరుగుతాయని బోల్షివిక్కులు హెచ్చరించారు. కానీ వింటర్ రాజభవనానికి ఉరేగింపు వెళ్లడాన్ని వారు ఆపలేక పోయారు.

సెయింట్ పీటర్స్‌బర్గ్ కార్మికులు తమ వినతిపత్రంలో ఇలా తెలియజేశారు.

"మేము, సెయింట్ పీటర్స్‌బర్గ్ కార్మి కులం, మా భార్యలు, పిల్లలు, నిరాధారుల యిన మా తల్లిదండ్రులు, మా ప్రభువుగారైన తమ వద్దకు సత్యాన్ని, సంరక్షణను కోరి వచ్చాం. మేం దరిద్రులం. పీడితులం, భరింపరాని శ్రమభారంతో కుంగిపోతున్నాం. అవమానాలకు గురవుతున్నాం. మానవు ల్లాగా మమ్మల్ని చూడటం లేదు. మేము ఓపికతో ఇన్నాళ్లూ బాధను సహిస్తూ వచ్చాం. రోజురోజుకూ దరిద్రం, అజ్ఞానం, హక్కులు లేకపోవడం అనే బురదలో లోతుకు, మరింత లోతుకు కూరుకుపోతున్నాం. నిరంకుశత్వం, నియంతృత్వం మా గొంతులను నులిమి వేస్తున్నాయ్. మా ఓపిక ఇక అంతమయి పోయింది. ఇక ఏ మాత్రం దుస్సహమైన బాధలు సహించడం కన్నా చావడమే మేలు అని అనుకొనే భయం కర సమయం ఆసన్నమయింది.

1905 జనవరి 9వ తేదీ ప్రాత:కా లాన, జార్ ప్రభువు ఆ రోజుల్లో నివసిస్తున్న వింటర్ భవనానికి, కార్మికులు ఊరేగింపుతో వెళ్లారు. కుటుంబాలకు కుటుంబాలు భార్యా పిల్లలూ ముసలీ ముతకతో సహా అంతా – జార్ ప్రభువు చిత్రపటాలతోనూ, చర్చి జండాలతోనూ వచ్చారు. ఊరేగింపులో మత గేయాలు పాడారు. రెండో నికలస్ (జార్) ఆ నిరా యుధ ప్రజలపైన కాల్పులు సాగించాల్సిందిగా ఆజ్ఞాపించాడు. సైనికుల చేతులలో వెయ్యి మందికి పైగా కార్మికులు చనిపోయారు.

కార్మికులతోపాటు బోల్షివిక్కులు కూడా ఊరేగింపులోకి వెళ్లారు. వారిలో అనేక మందిని అరెస్టు చేశారు. ఎందరినో చంపివేశారు. కార్మికుల రక్తంతో తడిసిన ఆ వీధుల్లో కిరాతకకృత్యానికి కారకుడెవడో, అతన్ని ఎలా ఎదిరించాలో కార్మికులకు బోల్షివిక్కులు తెలియజెప్పారు. ఆనాటి నుండీ జనవరి 9 బ్లడీసండే (రక్తసిక్త రవివారం) అని పిలువబడుతూ వచ్చింది. ఆరోజున కార్మికులు గుణపాఠం నేర్చు కొన్నారు. ఈ భయంకర వార్త నలుదిశలా వ్యాపించింది. దేశమంతా క్రోధంతో అట్టుడికిపోయింది. జార్ కిరాతక చర్యకు అసమ్మతిగా రాజకీయ కోర్కెలతో కూడిన సమ్మె చేయని పట్టణమంటూ ఏదీ లేదు.

ఆ తర్వాత కాలంలో బోల్షివిక్కులు పెరుగుతున్న నిరంకుశత్వానికి, దిగజారు తున్న జీవన పరిస్థితులకు వ్యతిరేకంగా అన్ని తరగతుల ప్రజల్లో చైతన్యం రగిలించారు. 1914 మొదటి ఆరునెలల్లో 14 లక్షల మంది కార్మికులు సమ్మె పోరా టాల్లో పాల్గొన్నారు. రష్యాలో అసంతృప్తి పెల్లుబికింది..

ఈ పరిస్థితుల్లో మొదటి ప్రపంచ యుద్ధం వచ్చింది. 1914 జులై 19న రష్యాపై జర్మనీ యుద్ధం ప్రకటించింది. జర్మనీ. ఆస్ట్రియా, హంగరీ, టర్కీ, బల్గేరియా ఒకపక్క– రష్యా, ఫ్రాన్స్, బ్రిటన్ వగైరాలు మరోపక్క పోరాడాయి. కొత్త మార్కెట్ల కోసం ప్రపంచాన్ని పునర్విభజించుకోవాలనే సామ్రా జ్యవాద పేరాశలు ఈ యుద్ధానికి దారితీ శాయి. జార్ ప్రభుత్వానికి కూడా అంతర్గ తంగా పరిస్థితిని చక్కదిద్దే సత్తాలేకపోయినా సామ్రాజ్యవాద రాజ్యదాహం మాత్రం ఉంది. యుద్ధం వల్ల పరిస్థితులు మరీ దిగజా రాయి. అది రాజకీయ సంక్షోభాన్ని పరా కాష్టకు చేర్చింది. రష్యాలో విప్లవ పరిస్థితి పరిపక్వమైందని లెనిన్ దూరదృష్టితో చూడగలిగారు. ఆయన చెప్పినట్టు రష్యా సామ్రాజ్యవాదపు గొలుసులో అతి బలహీ నమైన లింకు అని తేలిపోయింది. ఈ యుద్ధాన్ని అంతర్యుద్ధంగా మార్చాలని లెనిన్ పిలుపిచ్చారు. యుద్ధంలో జార్ ప్రభుత్వం ఓడిపోవడం ప్రజల విముక్తి పోరాటాన్ని బలోపేతం చేస్తుందని ఆయన వివరించారు.

యుద్ధం తాకిడికి దేశంలో పరిస్థితులు మరింతగా దిగజారాయి. యుద్ధంలో గానీ దుర్భరపరిస్థితుల వల్ల ఆకలి అనారోగ్యాల వల్ల గానీ మొత్తం లక్షన్నర మంది రష్యన్లు చనిపోయారు. ఆహారానికి తీవ్ర సంక్షోభం ఏర్పడింది.

1917 ఫిబ్రవరిలో సైనికులు కూడా తిరగబడ్డంతో రష్యాలో ఒక తాత్కాలిక ప్రభుత్వం ఏర్పడింది. దానికి బూర్జువా వర్గం నాయకత్వం చేపట్టింది. లెనిన్ ఈ పరిణామాలను సరైనదిశలో మలిచేందుకు ఎప్పటికప్పుడు ఎత్తుగడలు రూపొందిస్తూ విప్లవపోరాటానికి నాయకత్వం అందిం చారు. 1917 ఏప్రిల్‌కు– జూలైకి మధ్య లెనిన్ 170 వ్యాసాలు, కరపత్రాలు, తీర్మా నాలు రాశారు. అవి కార్మికవర్గ పార్టీ ఎత్తుగడల ప్రాధాన్యత తెలిపే పెద్ద బాలశిక్షల వంటివి.

ఫిబ్రవరి విప్లవం తర్వాత రష్యాలో

ద్వంద్వ అధికార వ్యవస్థ ఏర్పడింది. సెయింట్ పీటర్స్‌బర్గ్‌లో, ఇతర నగరాల్లో జన బాహుళ్యం తమ ప్రతినిధులతో సోవియట్‌లు ఏర్పరిచారు. అయితే బోల్షివిక్కులు ఇంకా రహస్య జీవితంలో ఉండటాన్ని ఆధారం చేసుకుని ఈ సోవియట్‌లలో మెన్షివిక్కులు ఇతరులు అధిక సంఖ్యలో వచ్చి కూచున్నారు. తమను ఎన్నుకున్న కార్మికవర్గం తరపున నిలబడిహక్కులు సాధించేందుకు బదులుగా వీరు తాత్కాలిక బూర్జువా ప్రభుత్వ పాచి కలకు వంతపాడే పాత్ర చేపట్టారు.

విప్లవానికి కీలకమైంది రాజ్యాధికార బదలాయింపు. ఫిబ్రవరిలో జార్ చేతుల్లో నుంచి బూర్జువాల చేతుల్లోకి అధికారం రావడంతో ఆ దశ పూర్తయిపోయింది. ఇక ఇప్పుడు కార్మికవర్గం అధికారం తనచే తుల్లోకి తీసుకుంటే తప్ప విప్లవ కర్తవ్యాలు పూర్తికావు. ఆ విధంగా తీసుకోవడం ఇప్పుడు ప్రధాన కర్తవ్యం. అదే జరిగితే సోషలిస్టు విప్లవ దశలోకి ప్రవేశించినట్టవుతుంది అని లెనిన్ వివరించారు. రష్యాలో అందుకు అవసరమైన భౌతిక ప్రాతిపదిక ఉంది. సోవియట్లు కార్మికవర్గ నియంతృత్వానికి సాధనాలుగా ఉపయోగపడతాయి అని ఆయన గుర్తించారు. అందుకే 'సర్వాధి కారాలు సోవియట్లకే' అని పిలుపిచ్చారు

విప్లవాన్ని రక్తసిక్తంగా వర్ణించే చాలా మంది చరిత్ర కారులు వాస్తవాలు మరుగు పరుస్తుంటారు. చరిత్రలో ఎప్పుడూ పాలక వర్గాలే ప్రజలపై హింసాకాండకు పాల్పడ తాయి. శాంతియుత పరివర్తనకు అవకాశమే లభిస్తే తప్పక ఉపయోగించు కోవలసిందే అని లెనిన్ అన్నారు. సోవియ ట్లకు అధికారం బదలాయింపు పూర్తయితే అలాంటి పరివర్తన జరుగుతుందని లెనిన్ భావన. కానీ మెన్షివిక్కులు, సోషల్ రెవల్యూషనరీల వైఖరి వల్ల అది జరగలేదు. చివరకు సోషలిస్టు రివల్యూషనరీ అనే కుహనా విప్లవ నాయకుడు కెరెన్స్కీ అభివృద్ధి నిరోధక శక్తుల తరపున అధికారం చేపట్టాడు. ఆ ప్రభుత్వం బోల్షివిక్కులపై తీవ్ర నిర్బంధానికి, నిఘాకూ పాల్పడింది. అందుకోసం ప్రత్యేక దళాలను ఏర్పాటు చేసింది. లెనిన్‌పై కూడా తప్పుడు కేసు బనాయించి, అరెస్టు కోసం వల పన్నింది. పోలీసుల నిఘా మధ్య పార్టీ నిర్ణయం మేరకు లెనిన్ జూలై ఆరున ఆఖరు సారి ప్రవాసం వెళ్లారు. మళ్లీ మూడు మాసాల తర్వాతే తిరిగి వచ్చాడు. ఈ దశలో కూడా ఆయన సైద్ధాంతికంగా అనేక కీలక రచనలు చేశాడు. రాజ్యాంగ యంత్రం- విప్లవం అనే పుస్తకం పూర్తిచేశాడు. సెప్టెంబరు నాటికి ఆయన తిరిగి సాయుధ తిరుగుబాటుకు సన్నాహాలు ప్రారంభించారు. కార్మికవర్గం నాయకత్వంలో లక్షలాదిరైతాంగంతో పాటు సైనికులు కూడా ఇటే రావడంతో పరిస్థితి పరిపక్వమైంది అన్నారు.

1917 అక్టోబరులో లెనిన్ విప్లవ సన్నాహాలను ప్రత్యక్షంగా పర్యవేక్షించేందుకై పెట్రోగ్రాడ్ తిరిగివచ్చారు..విప్లవ కేంద్రం, సైనిక విప్లవ కేంద్ర సంస్థల కార్యకలా పాలను లెనిన్ ప్రత్యక్షంగా పర్యవేక్షించారు. ఆ నెలరోజులూ ఆయన తిరుగుబాటు తప్ప మరో ఆలోచనచేసేవారు కాదని భార్య కృపస్కయా తర్వాత గుర్తు చేసుకున్నారు. బోల్షివిక్కులు ఫ్యాక్టరీలు, పొలాలు, సైనిక కేంద్రాలు ప్రతిచోటా ప్రవేశించారు. యుద్ధ నౌకలు స్వాధీనం చేసుకున్నారు. అలాంటి వాటిలో ఒకటైన అరోరా నౌకకు కొన్ని ప్రత్యేక బాధ్యతలు అప్పగించారు.

ప్రతిఘటనతో ఉక్కిరిబిక్కిరైన తాత్కాలిక ప్రభుత్వం విప్లవ శక్తులను అణచేందుకు నవంబరు ఆరున ఆఖరి ప్రయత్నం చేసింది. లెనిన్ ఊహించినట్టే పరిణామాలు మెరుపువేగంతో తోసుకొ చ్చాయి. నవంబరు ఆరున (పాత క్యాలెండర్ ప్రకారం అక్టోబరు 24) రహస్యంగా ఉ ండగానే పరిస్థితి తీవ్రతను వివరిస్తూ కేంద్రకమిటీ సభ్యులకు లెనిన్ లేఖ రాశారు. "నేను 24 సాయంత్రం ఈ పంక్తులు రాస్తున్నా. పరిస్థితి చాలా తీవ్రంగా వుంది. ...ఏది ఏమైనా ఈ సాయంత్రానికి మనం ప్రభుత్వాన్ని పట్టుకోవాలి.... మనం నిరీక్షణలో గడపకూడదు. మనం అంతా కోల్పోవచ్చు.. ప్రభుత్వం కుప్పకూలడానికి సిద్ధంగా ఉంది. మనం చివరి చావు దెబ్బ కొట్టాలి."

నవంబరు ఆరున సాయుధులైన కార్మికులు, తిరగబడిన సైనికులతో కూడిన విప్లవ దళాలు రంగంలోకి దిగాయి. కొన్నిగంటల వ్యవధిలోనే కీలకమైన వంతె నలను, తంతితపాలా కేంద్ర కార్యాల యాన్ని, రైల్వేస్టేషన్ను వశపరుచుకున్నాయి. లెనిన్ పథకం జయప్రదంగా అమలు జరిగింది. ఆ అర్ధరాత్రి సమయానికి ఆయన జార్ ప్రభుత్వాధికార నివాసమైన స్మోల్నీ భవ నంలో చేరి దాన్నివిప్లవ కేంద్రంగా మార్చారు. గంట గంటకూ విప్లవ శక్తులు ఆధిక్యత సాధిస్తూ వచ్చాయి. చివరకు కెరెన్‌స్కీ పారిపోయాడు. ఆయన మంత్రివర్గం వింటర్ ప్యాలెస్‌లో సైనిక రక్షణలో తలదా చుకుంది. ఇక వింటర్ ప్యాలెస్ స్వాధీనమే ఆఖరి ఘట్టం. అందుకు అరోరా నౌక పేలుడు దాడికి సంకేతం కావాలి. వింటర్ ప్యాలెస్‌పైకి ప్రజాదళాలు దూసుకెళ్లాలి. అవసరమైతే నౌక నుంచి కాల్పుల వర్షం కురిపించాలనేది అవగాహన.

నవంబరు 7 ఉదయం 10 గంటలకు తాత్కాలిక విప్లవ ప్రభుత్వ ప్రకటన వెలువడింది.." తాత్కాలిక ప్రభు త్వం కూల్చివేయబడింది. రాజ్యాధికారం కార్మిక సైనిక ప్రతినిధులతో కూడిన పెట్రోగ్రాడ్ సోవియట్‌కు, విప్లవ సైనిక కమిటీకి హస్తగతమైంది...

''ప్రజలందరరూ శాంతియుత ప్రజాస్వామ్యం, భూస్వామ్య యాజమాన్యం రద్దు, ఉత్పత్తిపై కార్మికుల అదుపు, సోవియట్ అధికారస్థాపన అనే ఏ లక్ష్యాలతోనైతే పోరాడారో ఆ లక్ష్యాలు నెరవేరాయి... కార్మిక సైనిక కర్షక విప్లవం వర్ధిల్లు గాక!"

# అక్టోబరు మహావిప్లవ శత వార్షికోత్సవానికి జేజేలు



**ఆర్.కృష్ణ**
ప్రెసిడెంట్



**ఎస్.ఉదయ భాస్కరరావు**
ప్రధాన కార్యదర్శి

## ఏపి పౌరసరఫరాల సంస్థ హమాలీల రాష్ట్ర యూనియన్ (సిఐటీయు)

# అక్టోబరు మహావిప్లవ
# శత వార్షికోత్సవానికి జేజేలు

## ఏపి ఎస్.బి.సి.ఎల్.ఐఎంఎఫ్ఎల్ డిపోస్ హమాలీ యూనియన్ (సిఐటియు)



**ఎన్.వి.సుబ్బారెడ్డి**
ప్రెసిడెంట్



**వి.కొండలరావు**
వైస్ -ప్రెసిడెంట్



**ఈ.శ్రీనివాస్**
సెక్రటరీ



# కార్మికవర్గానికి శుభాకాంక్షలు



## డి. ఈశ్వర్

**చైర్మన్ ఏపి జెఏసి అమరావతి, కృష్ణాజిల్లా**

**జనరల్ సెక్రటరీ ఏపి మున్సిపల్ మినిస్టిరియల్ ఎంప్లాయిస్ అసోసియేషన్**

**ప్రెసిడెంట్, విజయవాడ మునిసిపల్ కార్పొరేషన్ మినిస్టిరియల్ ఎంప్లాయిస అసోసియేషన్**

**ప్రెసిడెంట్, విజయవాడ మున్సిపల్ కార్పొరేషన్ ఎంప్లాయిస్ కో-ఆపరేటివ్ క్రెడిట్ సొసైటి**

# విప్లవంలో కార్మికవర్గ నాయకత్వపాత్ర - లక్ష్యాలు

- నండూరి ప్రసాదరావు

"మొత్తం ఉత్పత్తి సాధనాల పంపకాన్ని, మారకాన్ని సోషలిస్టుపరం చేసే సోషలిస్టు రాజ్యాన్ని ఏర్పరచటం ద్వారానే కార్మికవర్గంపై దోపిడీ అంతమొందించబడగలదని సిఐటియు విశ్వసిస్తోంది. సోషలిస్టు ధర్మానికి గట్టిగా కట్టుబడి ఉంటూనే అన్ని రకాల దోపిడీల నుండి సంపూర్ణంగా విముక్తి చేయటానికి సిఐటియు నడుం కట్టి నిలిచింది"

"వర్గ పోరాటం లేకుండా ఏ సామాజిక పరివర్తననీ తీసుకురావటం సాధ్యం కాదని అది దృఢంగా నమ్ముతోంది. వర్గ సామరస్య పంథాన కార్మికవర్గాన్ని నడిపించటానికి జరిగే ప్రయత్నాలను అది సదా తిప్పి కొడుతుంది. ప్రజల్లోని ఇతర సెక్షన్ల ప్రజాతంత్ర కోర్కెలను అది బలపరుస్తూ ఈ రోజున ఉన్న బూర్జువా, భూస్వామిక పరిపాలనను తొలగించి దానిస్థానే ప్రజల ప్రజాస్వామిక పరిపాల నను ప్రవేశపెట్ట డానికి జరిగే ఉమ్మడి పోరాటంలో ఇతర ప్రజాస్వామిక శక్తుల సహాయాన్ని స్వీకరిస్తుంది". అంటే సోషలిస్టు సమాజ స్థాపన కార్మికవర్గం మహత్తర కర్తవ్యం. దీనికి ముందు కార్మికవర్గం అంటే ఏమిటో, దాని కర్తవ్య నిర్వహణకు ఎటువంటి చైతన్యం ఉండాలో తెలుసుకోవాలి. దాని శత్రువు బూర్జువా వర్గ ఆనుపానులేమిటో, దానిని నిర్జించటం ఏ విధంగా సాధ్యమో తెలుసుకోవాలి. ఇవి తెలుసుకోకుండా సోషలిజం - సోషలిజం అని గంతులు వేయటం వాగాడంబరం అవుతుంది.

"బూర్జువాజీ అంటే సామాజిక ఉత్పత్తి సాధనాలకు సొంతదారులై కూలీలను నియమించి పని చేయించుకునే పెట్టుబడిదారీ వర్గం అని అర్థం. శ్రామికవర్గం అంటే ఉత్పత్తి సాధనాలు లేని కారణాన బతుకు తెరువు కోసమని శ్రమ శక్తిని అమ్ముకునే ఆధునిక శ్రామికవర్గం అని అర్థం" అని ఎంగెల్స్ 1888లో కమ్యూనిస్టు ప్రణాళిక ఇంగ్లీషు కూర్పులో వివరించారు.

సమాజం ఎల్లప్పుడూ ఒకేచోట నిలవదు; ఎప్పుడూ మారుతూ ఉంటుంది. ఒకప్పుడు బ్రహ్మాండమైన మార్పునకు లోనై పాత సమాజపు రూపురేఖలే మారిపోతాయి. దానినే విప్లవం అంటారు. ఇటువంటి విప్లవాలు ఇప్పటికే కొన్ని జరిగాయి.

మానవ సమాజ ప్రారంభంలో ఆదిమ కమ్యూనిస్టు సమాజం అని ఉండేది. దానిలో కొన్ని దోపిడీ శక్తులు బయలుదేరి ఆధిక్యతను సంపాదించి ఆదిమ కమ్యూనిస్టు సమాజాన్ని రద్దు చేసి దానిస్థానే బానిస సమాజాన్ని ఏర్పరిచాయి. బానిస ప్రభువులు దోపిడీగాండ్లుకాగా బానిసలు వారికి ఊడిగం చేసేవారు. వందల సంవత్సరాలు బానిసలు పోరాడిన తర్వాత బానిస సమా జం అంతరించి ఫ్యూడల్ (భూస్వామ్య) వర్గం, భూదాసుల వర్గం అనే వర్గాలు ఏర్పడ్డాయి. భూస్వాములు దోపిడీదార్లుకాగా భూదాసులు ఏ హక్కులూ లేని, ఏ ఉత్పత్తి సాధనాలూ లేని దాసులుగా పడి ఉండేవారు. ఈ భూస్వామ్య యుగం అంతరించి పెట్టుబడిదారీ సమాజం ఆవిర్భవించింది. ఒకవైపు పెట్టుబడిదారీ వర్గం దోపిడీ వర్గంగా ఉండగా కార్మికవర్గం దోపిడీ చేయబడే వర్గంగా ఉంది.

ఈ మార్పులన్నిటికీ మూల కారణం ఆ సమాజంలో ఉన్న అంతర్గత వైరుధ్యాలు; ఆ సమాజ గర్భంలోనే పెరుగుతూ ఉండే కొన్ని శక్తులు. ఈ శక్తుల పూర్తి వికాసానికి పాత సమాజ సంబంధాలు అడ్డుపడుతూ ఉండటం మూలకంగానే అవి తిరుగుబాటు చేస్తాయి. ఫ్యూడల్ శృంఖలాలన్నింటినీ ఛేదించుకుని పెట్టుబడిదారీ అభివృద్ధి అమిత వేగంతో సాగింది. ఈ విధంగా చారిత్రకంగా ఇది అత్యంత విప్లవకరమైన పాత్రనే నిర్వహించింది. బూర్జువా వర్గం అభివృద్ధి అయిన కొద్దీ దానిలో అంతర్గత వైరుధ్యాలు పెరుగుతాయి. ఉత్పత్తి సాధనాలు విపరీతంగా పెరుగు తాయి. ఉత్పత్తి అమితంగా సాగుతుంది. మరోవైపు దరిద్రుల సంఖ్య పెరుగుతుంది. ఉత్పత్తి ప్రజల కొనుగోలు శక్తికన్నా చాలా హెచ్చుగా ఉంటుంది. ఫలితంగా ప్రతి 6, 7 సంవత్సరాల తర్వాత ఉత్పత్తి విడుదల కాక క్షీణించటం జరుగుతుంది. దానినే ఆర్థిక సంక్షోభం అంటారు. అమ్ముకొని సొమ్ము చేసుకునే స్తోమత పెట్టుబడిదార్లకు క్షీణిస్తుంది. ఈ ఆర్థిక సంక్షోభంలోనే పెట్టుబడిదారీ విధానంలోని మూల వైరుధ్యా లన్నీ బయటపడతాయి. అమితంగా ఉత్పత్తి చెయ్యగల ఉత్పత్తి శక్తులకు, అమ్ముకొని సొమ్ము చేసుకుంటే గానీ లాభాలు తీయరానటువంటి ఉత్పత్తి సంబంధాలకు మధ్య వైరుధ్యం స్పష్టమవుతుంది. సరుకుల అమ్మకానికి ఏర్పడిన మార్కెట్, సరుకులు అమ్ముడుపోకుండా ఉండే పరిస్థితికి దారితీస్తుంది. సరుకుల ఉపయోగం ఉన్నా దాని సప్లై హెచ్చుగా ఉన్నా అధిక సంఖ్యలో ఉండే ప్రజాసామాన్యం కొనుగోలు శక్తి క్షీణించి డిమాండు లేకుండా పోతుంది. పెట్టుబడిదారులకు, కార్మికులకు మధ్య వైరుధ్యం తీవ్రమవుతుంది. ఇటువంటి వైరుధ్యాలన్నీ పెట్టుబడిదారీ విధానం అంతరిస్తే తప్ప పరిష్కారం కావు. ఉత్పత్తి శక్తుల పెరుగుదలకు లాభానికమ్ముడు కావలసిన ఉత్పత్తి సంబంధాల మధ్య వైరుధ్యం ఏర్పడుతుంది.

ఇక్కడనే మరొక మహత్తర చారిత్రక శక్తి విప్లవ శక్తి, తన చారిత్రక ధర్మాన్ని నిర్వర్తిస్తుంది. అదే కార్మిక వర్గం. దీనినే కమ్యూనిస్టు ప్రణాళికలో కారల్ మార్క్స్ ఈ కింది విధంగా చెప్పాడు.

"బూర్జువా వర్గం ఏ ఆయుధాలతో నేల కూల్చిందో ఆ ఆయుధాలే ఇప్పుడు బూర్జువా వర్గానికి ఎదురు తిరుగుతాయి. బూర్జువా వర్గం తన చావు తెచ్చుకునే ఆయుధాలను

తానే తయారు చేయటమే కాకుండా ఆ ఆయుధాలను ఉపయోగించే మనుజులను - ఆధునిక కార్మిక వర్గాన్ని - శ్రామికులను సృష్టించింది."

"ఈ విధంగా పాత వ్యవస్థ సఖ శిఖపర్యంతమూ శిధిలమైపోయిన పిమ్మట కార్మికులు కేవలం శ్రమశక్తి నమ్ముకొని జీవించే శ్రామికులుగా మారిన పిమ్మట. ఈ శ్రామికుల శ్రమే కాపిటల్ రూపాన్ని ధరించిన పిమ్మట, కాపిటలిస్టు ఉత్పత్తి విధానం వేళ్లూనుకొని నిల్చిన పిమ్మట, అప్పుడు శ్రమ మరింత సామాజికమవుతుంది. భూమి, ఇతర ఉత్పత్తి సాధనాలుగా మారతాయి. వ్యక్తిగత ఆస్తిపరులు దోచుకోబడటంకాదు, కార్మికులను దోచుకొనే దోపిడీగాండ్రే, కాపిటలిస్టులే దోచుకోబడాలి. దోపిడీ గాండ్రనే దోచుకోవటం కాపిటలిజమందలి అనివార్య సూత్రాలను బట్టే జరుగుతుంది. ఒక కాపిటలిస్టు చాలా మంది ఇతరులను నాశనం చేస్తాడు. ఈ పరిణామం జరుగుతూ ఉన్న కొద్దీ దారిద్ర్యం, ఆకలి, జాడ్యాలు, దాస్యం, దోపిడీ, అభివృద్ధవుతాయి. కానీ వీటితోబాటుగానే కాపిటలిస్టు ఉత్పత్తి క్రమంలోని మెకానిజం వల్లనే ఐక్యమై, సంఘీభావాన్ని పెంపొందించుకొని, గట్టి శిక్షణను కలిగియుండే కార్మికుల సంఖ్య పెరుగుతూ ఉంటుంది. వీరి పోరాటాలు వృద్ధవుతాయి. ఉత్పత్తి విధానంతోనే పుట్టి దానితోనే పెరుగుతూ ఉండే కాపిటల్ గుత్తాధికారం ఇకముందు ఉత్పత్తి సాధనాల కేంద్రీకరణ, శ్రమ సామాజికం కావటం ఎంత అభివృద్ధి అవుతాయంటే ఇక వీటికి కాపిటలిస్టు సంబంధాలకూ పొత్తుకుదరదు. ఈ సంబంధాలు పేలి పగిలిపోతాయి. కాపిటలిజమందలి స్వంత ఆస్తి హక్కులకు యమదూతల దర్శనం కలుగుతుంది. దోచుకునేవారే దోచుకోబడతారు."

"ఈనాడు బూర్జువా వర్గాన్ని ముఖాముఖి ఎదిరించి నిలబడే వర్గాలన్నిటిలోనూ ఒక్క కార్మికవర్గమే అసలైన విప్లవ వర్గం. ఇతర వర్గాలు ఆధునిక పరిశ్రమ సమక్షంలో క్షీణించిపోయి చిట్టచివరికి అదృశ్యమైపోతాయి; దాని ప్రత్యేకమైనట్టి, ముఖ్యమైనట్టి ఉత్పన్నం కార్మికవర్గమే" అని కమ్యూనిస్టు ప్రణాళిక చెబుతుంది.

ఈనాడు పెట్టుబడిదారీ విధానం విపరీతంగా పెరిగి కొత్త లక్షణాలను సంతరించుకుంది. దీనినే సామ్రాజ్యవాదం అంటున్నాం. దీనికి ఐదు ప్రధాన లక్షణాలు ఉన్నాయని లెనిన్ చెబుతాడు. మొదటిది ఆర్థిక జీవితంలో విపరీత ప్రభావాన్ని కలుగజేసే గుత్తసంస్థ లేర్పడి ఉత్పత్తి పెట్టుబడి కేంద్రీకరింపబడటం.

రెండోది పరిశ్రమల్లో పెట్టే పెట్టుబడి, బ్యాంకు పెట్టుబడి కొద్దిమంది కుబేరుల చేతుల్లో పోగుపడి ఫైనాన్స్ పెట్టుబడిగా మారుతుంది. పరిశ్రమలన్నీ ఈ ఫైనాన్స్‌పైనే ఆధారపడతాయి. మన దేశంలో టాటా ఉన్నాడంటే ఆయన స్వంత పెట్టుబడి పదమూడు పర్సెంటో, పద్నాలుగు పర్సెంటో ఉంటుంది. తక్కినదంతా బ్యాంకుల నుంచి తెచ్చుకునే అప్పు.

మూడో లక్షణం సరుకుల ఎగుమతి కన్నా పెట్టుబడే ఎక్కువగా ఎగుమతి అవుతూ ఉంటుంది. ఈ రోజున మన దేశంలో పరిశ్రమలన్నీ అమెరికన్ పెట్టుబడిపై ఆధారపడటం చూస్తున్నాం. సరుకుల బదులు అప్పులివ్వటం, పెట్టుబడి పెట్టటం ఎక్కువవుతోంది. నాలుగో లక్షణం అనేక దేశాల్లో గుత్త సంస్థలు తమలో తాము విలీనమై, ఈ గుత్త సంస్థలు కూడా విలీనమై ప్రపంచాన్నంతటినీ శాసించే గ్లోబల్ సంస్థలుగా తయారవుతున్నాయి.

ప్రపంచాన్నంతటినీ తమలో తాము పంచుకోవటం ఐదో లక్షణం. బ్రిటన్, ఫ్రాన్స్ దేశాలు ప్రపంచంలో ఎక్కువ భాగాన్ని ఆక్రమించుకున్నాయి. తర్వాత పెట్టుబడిదారీ విధానం బాగా అభివృద్ధి అయిన జర్మనీ, బ్రిటీష్, ఫ్రాన్స్‌లను తన్ని ఆ మార్కెట్‌లను లాక్కోవాలని చూసింది. ప్రపంచ పునర్విభజనకై ఇందుకై రెండు ప్రపంచ యుద్ధాలు జరిగాయి. మొదటి ప్రపంచ యుద్ధం మధ్యలో రష్యన్ మహా విప్లవం జరిగి ప్రప్రథమ సోషలిస్టు రాజ్యం ఏర్పడింది. రెండో ప్రపంచ యుద్ధానంతరం ప్రపంచంలోకెల్లా పెద్దదైన చైనాతో సహా అనేక దేశాలు సోషలిస్టు దేశాలుగా మారి సోషలిస్టు ప్రపంచం ఏర్పడింది.

రెండో ప్రపంచ యుద్ధానంతరం అమెరికా బ్రహ్మాండమైన పారిశ్రామికశక్తిగా అభివృద్ధి చెందింది. ఇది మిలిటరీ శక్తితో కలిసిపోయి మోనోపలీ మిలిటరీ రాజ్యంగా ఏర్పడింది. 1991లో సోషలిస్టు ప్రపంచం విచ్ఛిన్నమైన తర్వాత అమెరికాకు పట్టపగ్గాలు లేకుండా పోయింది. సామ్రాజ్యవాదం లక్షణాలన్నీ బహు నగ్నంగా కనిపించ సాగాయి. బ్యాంకింగ్ పెట్టుబడి పారిశ్రామిక పెట్టుబడి కలిసిపోయి ఫైనాన్స్ పెట్టుబడిగా తయారుకావటం పరాకాష్టకు జేరింది. పెట్టుబడి ఎగుమతి అపారమైంది. నూతన వలస విధానం ప్రారంభమైంది.

పరిశ్రమలు అత్యంత ఆధునికమైనవి. కార్మికుల సంఖ్య విపరీతంగా తగ్గిపోతున్నది. టెక్నీషియన్స్, మేనేజీరియల్ స్టాఫ్, ఆటోమెటిక్ యంత్రాల ద్వారా ఉత్పత్తి జరుగుతోంది. పూర్వం ఏడెనిమిదేళ్లకు సంభవించే సంక్షోభం ఇప్పుడు నాలుగు, ఐదేళ్లకు సంభవిస్తోంది. అమితోత్పత్తి మధ్యే అశేష ప్రజానీకం దుర్భర దారిద్ర్యంలో యమయాతనలు అనుభవించే పరిస్థితి దాపురించింది. రైతులు, మధ్యతరగతి ప్రజలు, కార్మికులు ఇతర కష్టజీవి ప్రజాస్వామ్యంలో అతి ఘోరంగా దోపిడీకి గురవుతున్నారు. అభివృద్ధి అవుతున్న దేశాలు విపరీతంగా దోచుకోబడుతున్నాయి. ఇటువంటి పరిస్థితుల్లో కార్మికులు నాయకత్వం వహించి ఇతరత్రా కష్టజీవులందర్నీ కలుపుకొని విప్లవపోరాటాలు సాగించాలి.

ఒక్కుమ్మడిగా పెట్టుబడిదారీ వ్యవస్థను ముట్టడించి నాశనం చేయగల స్థితికి ఇంకా కార్మికవర్గాన్ని దానికి బానిసలుగా నిలిచే పీడిత ప్రజాసామాన్యాన్ని సిద్ధం చేయటం కోసం ప్రయత్నం చేయాలి. పెట్టుబడిదారీ విధానం దానంతటదే కూలిపోదు. విప్లవం దానంతటదే విజయం పొందదు. ఇందుకోసం సర్వసన్నాహాలు చేసుకుని పోరాడి జయించాలి. ఇందుకు శ్రామికవర్గ మొక్కటే సమర్థవంతమైనవర్గం.

# అక్టోబరు సోషలిస్టు విప్లవ
# శత వార్షికోత్సవం సందర్భంగా అభినందనలు



**కె.నరసింహారావు**
ప్రెసిడెంట్



**జి.వాసు**
వైస్ -ప్రెసిడెంట్



**పి.సుబ్బారావు**
సెక్రటరీ



**యస్.డి.చక్రవర్తి**
డైరెక్టర్



**ఎన్.వి.శివరావు**
డైరెక్టర్



**కె.రాజేంద్రబాబు**
డైరెక్టర్



**డి.వి.రమణమూర్తి**
డైరెక్టర్

# ది ఎన్‌టిఆర్ యూనివర్సిటీ ఆఫ్ హెల్త్ సైన్సెస్
# ఎంప్లాయీస్ కో-ఆపరేటివ్ క్రెడిట్ సొసైటి లిమిటెడ్

## నెం.జి.3018, విజయవాడ. (Estd.1994)

## Dr.NTR UHS, VIJAYAWADA.

Printed, Published & Edited by M.A.Gafoor on behalf of CITU A.P. State Committee from N.P.R. Bhavan, 24-24-14, Rajaka veedhi, Durgapuram, Vijayawada -3, Type setting & Printing at Prajasakti Daily Printing Press, Nulakapeta, Tadepalli, Guntur Dt.



# THE ANDHRA PRADESH MINERAL DEVELOPMENT CORPORATION LIMITED

Corporate Office, 294 / 1D, Tadigadapa to Enikepadu 100 Ft. Road, Kanuru Village, Penamaluru Mandal, Vijayawada - 521137 , Phone : 0866-2429999, Email info@apmdc.ap.gov.in



## Barytes

The Mangampet Barytes deposit in Kadappa district is the single largest deposit in the world. With 98% of the Indian Barytes being produced by APMDC, Indian Barytes are essentially APMDC Barytes. The Corporation produces 3 MnT of Barytes per annum with a planned increase in production capacity to 5 MnT.



## Black Galaxy Granite

Black Galaxy Granite deposits occurring in Cheemakurthy, Prakasham district is a unique variety and generates significant demand in the international and domestic market for use as a decorative stone. The Corporation is currently producing Black Galaxy Granite through the Joint venture route.



## Ball Clay

A major raw material for ceramic and refractory industries - Ball clay is being produced by the Corporation in Dwaraka Tirumala village in West Godavari district through Raising cum sale contracts.



## Bauxite

Bauxite is the major raw material for the production of Alumina and Aluminium. Bauxite deposits occur in the Vishakhapatnam and East Godavari districts of Andhra Pradesh.

## VISION STATEMENT

To become the most valued Company for sustainable development of minerals with commitment for environmental protection and safety, and to become the leader in mining by optimal utilization of resources, creating added value and with sustainable growth.

## MISSION STATEMENT

Exploration and exploitation of mineral resources with due emphasis on environment & safety and development & promotion of mineral based industries adopting innovative technology and advanced skills for accelerated and sustainable growth.






## Heavy Mineral Beach Sands

982 km long coastal line of Andhra Pradesh contains heavy mineral beach sands comprising of national strategic importance minerals such as Garnet, Ilmenite, Rutile, Leucoxene, Zircon, Silliminite and Monazite. The Corporation intends to exploit these minerals and establish Value Addition plants through Joint venture route.



## Coal

The Corporation has been allotted two Coal blocks in Suliyari, Madhya Pradesh and Madanpur South, Chattisgarh having estimated gross reserves of 300 million tonnes. The coal blocks will have a production capacity of 10 MnT per annum once completely operationalized.



## Iron Ore

The mining leases over 957 Ha in Prakasham district possesses reserves of over 80 million tonnes and The Corporation intends to establish mining, beneficiation and palletization plants through Joint venture route.



## Other Minerals

Additionally, the Corporation also possesses and operates mining leases for the following minerals:

- Silica sand
- Calcite
- Blue and color granite
- Limestone





Karmikalokam 2017 November, Pages 56, Publishing 2.11.17 Post: Dt. 10, 11,11.17, RNI No. APTEL / 1985 / 1324, D/VJ/169/2015-17





# 28 ప్రాజెక్టులు

దేశానికి పట్టెడన్నం పెట్టేవాడే రైతు. అందుకే రైతన్నను 'అన్నదాత' అని, 'దేశానికి వెన్నెముక' అని అంటారు. స్వేదం చిందించి సేద్యం చేసే రైతన్నకు సకాలంలో సాగునీరు అందిస్తే పసిడిరాశులు పండిస్తారు. మొత్తం సమాజం అంతా రైతు మీదే ఆధారపడి ఉంది.

రైతు అరక కట్టి, చేను దున్ని, విత్తు నాటి, పంట పండించడానికి పూనుకుంటేనే రైతూ, కూలీ బాగుంటాడు. పండిన పంటతో రైతు బాగుంటాడు. రైతు–కూలీ బాగుంటేనే వ్యాపారస్తుడు బాగుంటాడు. వ్యాపారస్తుడు బాగుంటే పారిశ్రామికవేత్త బాగుంటాడు.

ఈ విధంగా మొత్తం ప్రగతి చక్రానికి రైతు ఇరుసులాంటివాడు. అలాంటి ప్రగతి రథానికి ప్రధాన ఇరుసులాంటి రైతు శ్రేయస్సును దృష్టిలో పెట్టుకుని రాష్ట్రప్రభుత్వం రాబోయే ఏడాదిలోగా 28 ప్రాజెక్టుల యొక్క ప్రయోజనాలను రైతుకు అందించాలనే లక్ష్యం నిర్దేశించుకుంది.

ఆ 28 ప్రాజెక్టుల గురించి, అవి అందించనున్న ప్రయోజనాల గురించి తెలుసుకుందాం.

## పురుషోత్తపట్నం ఎత్తిపోతల పథకం



ఈ పథకం ద్వారా గోదావరి-ఏలేరు నదుల అనుసంధానం గావించి, 30 టీఎంసీల గోదావరి నీటిని రెండు దశలో ఎత్తిపోయటమే లక్ష్యంగా ఉద్దేశించబడింది. ఏలేరు రిజర్వాయర్, పిఠాపురం బ్రాంచి కెనాల్ కింద 2.15 లక్షల ఎకరాలకు సాగునీరు.

## పోగొండ రిజర్వాయర్



పాపికొండల మధ్యనున్న బైనేరుపై ఏర్పాటుచేసిన బండకట్టు ఆనికట్టుకు ఎగువన పోగొండ రిజర్వాయర్ ఏర్పాటుచేసి, పశ్చిమగోదావరి జిల్లాలో 3,652 ఎకరాలకు సాగునీరు.

## అడవిపల్లి రిజర్వాయర్



హంద్రి-నీవా పథకం ఫేజ్-2లో భాగమైన అడవిపల్లి రిజర్వాయర్ నిర్మాణం ద్వారా చిత్తూరు జిల్లాలోని వాయల్పాడు, పీలేరు, పుంగనూరు నియోజకవర్గాల్లోని 60 వేల ఎకరాలకు సాగునీరు.

## మారాల రిజర్వాయర్



హంద్రి-నీవా ప్రధాన కాలువ ఆధారంగా మారాల రిజర్వాయర్ నిర్మాణం. తద్వారా అనంతపురం జిల్లాలో 18 వేల ఎకరాలకు సాగునీరు.

## సంగం బ్యారేజి



నెల్లూరు జిల్లాలో పెన్నా డెల్టా కాలువ వ్యవస్థ కింద వున్న 2,59,387 ఎకరాల ఆయకట్టు స్థిరీకరణ.

## గుండ్లకమ్మ రిజర్వాయర్



ప్రకాశం జిల్లాలో 80,060 ఎకరాలకు సాగునీరు మరియు ఒంగోలు పట్టణంతో పాటు ఇతర గ్రామాలకు త్రాగునీరు.

## పులిచింతల ప్రాజెక్టు



పులిచింతల జలాశయంలో పూర్తిస్థాయిలో 45.77 టీఎంసీలు నిల్వచేసి కృష్ణాడెల్టాలోని 13. 06 లక్షల ఎకరాల ఆయకట్టు స్థిరీకరణ.

| | మనసు ఫౌండేషన్ |
|---|---|
| | పుస్తకాల పరిశీలనాపట్టిక |

| పుస్తకం సంఖ్య | KLV01A524 |
|---|---|
| పుస్తకం పేరు | కార్తీక లోకం |
| తారీఖు | 28/8/23 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 57 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Nandini |
| పేజీలు విడదీసినది | Nandini |
| స్కాన్ చేసినది | Nandhu |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |